# కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలు, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ సర్వ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-0-0 6 ఔ. రు. 2-2-0

## అమృత

రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును ఇచ్చును. ఈ మేలైన ఔషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-0-0 6 ఔ. రు. 2-2-0

## అర్క

సర్వజ్వరనివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన ఆమాశయమునందు క్రిమికూటముచేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమును జ్వరిగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

## కేసరి కుటీరం లిమిటెడ్

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు:

సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.



# గృహలక్ష్మి

స్త్రీలసచిత్రమాసపత్రిక


సంపాదకుడు:

డాక్టరు. కే. యన్. కేసరి


# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY

**ఆగస్టు—1949**




సంపుటము ౧౨] [సంచిక ౨




సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయముగాలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేవక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

సంచికలు చేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

ఈ ఆగష్టు నెలలోనే

ఆంధ్రదేశములోని ప్రముఖ కేంద్రాలలో విడుదల

జుపిటర్ వారి

# కన్నియిన్ కాదలి

....లేక....

# తప్పుల తమాషా

అద్భుతమైన హాస్య చిత్రరాజము

A GOOD HEARTY COMEDY WITH PLENTY OF LAUGHS! ADAPTED FROM SHAKESPEARE'S TWELFTH NIGHT

రామనాథ్ శేఖర్లచే
తయారుచేయబడినది...

పూర్ణా రిలీస్

JUPITER PICTURES CIRCUIT

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయ కల్యాణీ !

---

# రెండవ స్వాతంత్ర్యదిన వార్షికోత్సవము

1947 సం॥ ఆగస్టు 15 వ తేదీన ఆంగ్లేయులు భారతదేశంలో తమ ప్రభుత్వాధికారం వదులుకొన్నారు. నాటికి నేటికి రెండు సంవత్సరాలు గడిచినవి. యథోచితంగా భారతదేశంలో ఈ శుభదినమున ఉత్సవం చేసుకుంటున్నాము. అయితే ఈ ఉత్సవ సమయాన గతం స్మరించి భవిష్యత్తు నూహించడం న్యాయంగదా.

ఈ రెండు సంవత్సరాలు మనకు సుఖంగా గడవలేదు. అసలీ స్వాతంత్ర్యసిద్ధి క్రమములోనే రెండుఛిద్రా లున్నాయని ఆనాడే చెప్పాము. ఒకటి దేశము రెండుగా విభజనగావడం; రెండు: ఆనాడు సిద్ధించింది డొమినియన్ స్టేటసేగాని సంపూర్ణ స్వాతంత్ర్యం కాకపోవడం. సంపూర్ణస్వాతంత్ర్యం అని నిర్ణయించడం, నిర్ణయించక పోవడం మనమీదనే వదిలేశారు. అదే గొప్పచిక్కు.

పాకీస్థాన్ నాటినుండి మనకుకల్పించిన తొందర్లు ఇంకా సర్దుబాటు కాలేదు. కాశ్మీరమొకటి ఎడతెగని చిచ్చైనది. మనకన్నిట అండమై మనతో అష్టకష్టాలుపడ్డ ఖాన్ సోదరులు మననుండి విడదీయబడి ఏమిగా నుంటున్నారో తెలేనిస్థితిలో నుంటున్నాము. వారి

నెట్లాగన్నా సమాధానపెట్టవలెనని ప్రయత్నం చేసిన "బాపూ" ఉద్రేకులైన హిందూ యువకుల ఆగ్రహానికి గురియై అసువులు విడిచారు.

తొలిరోజుల హల్లకల్లోలంలో అతతాయులచే అపహరింపబడిన వివాహితలు, అవివాహితలునైన స్త్రీలు ఇంకా స్వంతఇండ్లకు చేరలేదు. బలవంతాలకు గురియైన పడుచులు కొందరు సిగ్గుచేత క్రుంగిపోయి "అట్లా పరులకొంపలలోనే పాడైయుంటాము; కరువుతో ఏమని స్వంత ఇండ్లకు రాగల" మని శపిస్తున్నారట కూడ.

ఇవన్నీ ఏదోవిధంగా సర్దుకుంటున్నాము. కాని అసలు స్వాతంత్ర్యసిద్ధివాడే పాకీస్థానం శాశ్వతంగా బ్రిటిష్ డొమినియన్‌గా ఉంటామని వాగ్దత్తం చేసిందని గుసగుసలు రేగినవి. అది డొమినియన్‌గా ఉండగా భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందడం అసంభవము, అసంగతము అని అందరికీ తెలుసు. అంతర్జాతీయ రంగంలో వ్యూహాలను చూస్తే మన మట్లా పాకీస్తానును మించి సంపూర్ణస్వాతంత్ర్యము ప్రకటించడం కొంత ప్రమాదకరమని పెద్దలకు తోచింది. సామ్రాజ్యములో రాగల విపత్తుకు సంపూర్ణమైన బందోబస్తు చేసుకోడానికి డొమినియన్ రాజ్యాలు సమకూడి భారతయూనియన్ నాహ్వానించారు. భారతరాజ్యాంగంలో నిర్ణయింప బడ్డ "సావరిన్ ఇండిపెండెంటు రిపబ్లిక్" అను ప్రవచనానికి భంగంలేకుండా డొమినియన్ ప్రతిపత్తి అని భారతయూనియన్ తరఃపున నెహ్రూగా అంగీకరింపక తప్పిందికాదు. దానిని భారతీయులను సమ్మతించక తప్పింది కాదు. ఇట్లా వప్పుకోడంచేత ప్రవచనానికే భంగం తప్పింది; నిర్వచనం భేదిస్తుంది-అంటారు పండితులు. అసలా సంబంధమే సహించమంటారు స్వాతంత్ర్యప్రియులు.

ఏప్పైరైతేనేమి తామరపువ్వు తావుల గుబాళిస్తే చాలదా? అంటే స్వాతంత్ర్యం ఎందుకు కోరామో అదే అవగింజలో అర్ధభాగం సిద్ధించలేదు.

అన్నోదకాలు, వస్త్రవాహనాలు, పనిపాటులు, పాడిపంటలు, సిరిసంపదలు, జ్ఞానవిజ్ఞానాలు అన్నీ అరకొరలే; అందతుకులే. అసలు రాజ్యాంగ చట్టనిర్మాణమన్నా ఇంకా-ముగియలేదు, నాటికి నాటికి వాయిదా బడుతున్నది.

స్వీయవిషయం: ఆంధ్రరాష్ట్ర సిద్ధి మరీ అధ్వాన్న మైనది; ఇందు ఒకరిది తప్పు ఒకరిది ఒప్పు అవడానికి వీలులేకుండా యున్నది.

గతం ఇంత గందరగోళంగా ఉండగా-భవిష్యత్తును నిదానించి ఊహించడం అంత తేలికైనపని కాదు. అయితే అది ఉపేక్షించవలసింది కాదు. ఊహించేకొద్దీ అడ్డులు,

ఆటంకాలు, అనుమానాలు మాత్రమే తోస్తుంటాయి. దీక్షతో, శ్రద్ధతో, విశ్వాసంతో, నడుముకట్టి ముందుకు సాగిపోవలసిందే. అందుకు "గృహలక్ష్మి" ని ప్రోత్సహించ నక్కర లేదు. ఆమె జీవితసారమే అది; ఆమె జీవిత సందేశమే అది.

నిష్టదారిద్ర్యం అనుభవిస్తున్నా నిద్ర లేవగానే మంగళసూత్రానికి కట్టుకున్న పచ్చి పసుపుకొమ్ము కళ్లకద్దుకుంటుందామె. నూకలగంజియైనాసరే అమృతంలా కాచి భర్తకు బిడ్డలకు ఆరగింపు చేస్తుంది. మడతకుడుములు తింటూ అయినాసరే నడుమువంచి ఇంటిల్లి పాదిని సేవించి పాటుపడుతుంది. ప్రత్యక్షంగా ఆమె పరిసరాలు ఎంత జుగుప్సాకరమైనా ఆమె అంతరంగంలో పీఠం వేసుకొన్న ఆదర్శం మాత్రం "నిత్య కళ్యాణం; పచ్చతోరణం."

అదే రెండవ స్వాతంత్ర్య దినోత్సవం నాడు భారతదేశానికి మా "గృహలక్ష్మి" ఆశించేది.

---

## శ్రావణ మంగళాంగి

రచన "ఉషాదేవి"

ఆషాఢమాసాన అందంగనిడి కొన్న
లేతగోరింటాకు పూతతోడ
శ్రావణపట్టితో మామ్మంగారంపిన
పట్టుకోకయు రైకగట్టికొంచు
పెండ్లినాడొచ్చిన వెండి బంగరునగల్
కాలిని కేలిని జాలువార
మేనమామిచ్చిన మేలిమి కాంచియు
నడుముక్రిందికి జారిపడుచునుండ
పసుపుపారాణిపూతలు విసుపులేక
పూసి, పూయించుకొంచును పుష్కలముగ
అంగనలొసంగు శనగలు "చెంగుచివర
ముడుచు మురిపెంపు శ్రావణ మంగళాంగి.

## ఆంధ్రతరుణి!

రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి

తరతరంబుల బానిస తనమువలన
పరువుతరిగిన మనతెన్గువారి పూర్వ
గరిమ భరతోర్వి నెలకొల్ప గడగతగిన
తరుణమరుదెంచె ఓయాంధ్రతరుణి! లెమ్ము.
పురుష నాయకత్వమునకు దేశంబెల్ల
విసిగిపోయె, శాంతి "వెఱ్ఱితలలు
వేయుచుండె" నిదురవిడనాడి సతులెల్ల
సలుపవలయు శాంతిసమరమిపుడు.
తెలుగురాష్ట్రంబు మనకు సిద్ధించువరకు
తెలుగుసతిశక్తి జగమెల్ల తెలియువరకు
విశ్వమంతట శాంతి వ్యాపించువరకు
నిదురపోరాదు ప్రతితెల్గుముదితకూడ.



# వరలక్ష్మీ వ్రతం



శ్రీమతి ఈమని వెంకటలక్ష్మమ్మగారు

అరుదెంచె శ్రావణం బతివైభవముగ
తరుణులకెల్ల సందడి పెంపుమీర
ఇండ్లకు వెల్ల వేయించి తీరుగను
గుమ్మమ్ములకు పసుపు కుంకుమల్ బెట్టి
తోరణమ్ములుగట్టి ద్వారములకెల్ల
వెలదులు దేవతా వేదికలకెల్ల
నిండారపసుబూసి సిరికుంకుమలది
చాలవిధముల ముస్తాబుగావించి
పూలదండలనెల్ల వ్రేలాడగట్టి
చేరి శ్రావణ శుక్రవారమ్ము నాడు
సందడిపడుచుండ సఖియలెల్లరును
ఆనాడు జానకమ్మ తివైభవమున
తనపట్టి భ్రమరకు దలయంటిపోసి
పదముల పసుపూసి పారాణిపెట్టి
కురులార్చి జెడవైచి మరువంబు మల్లె
బంతులు జెడపైని బదిలముగ బెట్టి
జిలుగు జలతారు పువ్వుల చీరగట్టి
కన్నుల సన్నంపు కాటుకదిద్ది
నుదుట కస్తూరిబొట్టు కుదురుగాదిద్ది
నగలెల్లబెట్టి జానకి ముద్దుపట్టి
మోమును దిలకించి ముదమొప్పబలికె
"అమ్మ! భ్రమరాంబ, వినవమ్మ నామాట
చేరి వర్లక్ష్మిని సేవించునపుడు
మనకు వేరొకదిక్కు మననీయకమ్మ
మనపాలిదైవంబె మహాలక్ష్మి నమ్మి
సకలసౌభాగ్యముల్ సమకూర్చునమ్మ
తన్నునమ్మినవారి దరిజేర్చునమ్మ,
ఆయురారోగ్యంబు లైశ్వర్యమిచ్చి
కరుణతో నాదేవి కాపాడునమ్మ"
అనవిని భ్రమరాంబ వినయమొప్పార
"అమ్మ మున్నెవ్వరో యున్నలమిన్న
పరమభక్తిని దీనినెరపినదనుచు
చెప్పబోయియు నిన్న జెప్పవైతివిగ
ఆకథ నెరిగింప వమ్మ యీనాడు"
అన విని సంతోష మారంగ దల్లి
కూతుచెక్కిలి నొక్కి కురులు సవరించి
"మ యమ్మ! హరురాణి మహిమంబువినుము
అరుదార కుండినం బను పట్టణమున
చారుమతి యనియేటి సాధ్వీలలామ
శమదమాదులుగల్గి శాంతమ్ముగల్గి
వినయంబుగల్గి వివేకంబుగల్గి
తనయీడు చెలులలో దగవన్నెకెక్కి
అత్తమామలసేవ నతిభక్తినెరపి
పతిసేవయే తనగతియంచునమ్మి
చిత్తశుద్ధియుగల్గి చిరయశముగల్గి
దైవంబులను సంతతముగొల్చుచును
దారిద్ర్యమేవేళ దన్నుపీడింప
వదలదు పతిభక్తి వదలదింతైన;
జిటమటలాడదు, జీకాకుపడదు.
ఈరీతినుండ నాయింతియొకరేయి
జక్కని కలగాంచె; సర్వమంగళయె
నవరత్న మణిభూషణమ్ములందాల్చి
పచ్చని మేనిపై పసుపమరబూసి
నుదుట కుంకుమబొట్టు కుదురుగాబెట్టి
నిండు చందురుబోలు నెమ్మోముజూడ
గలకలలాడు వెన్నెల నవ్వుతోడ

# వరలక్ష్మీ వ్రతం

ఘల్లు ఘల్లుమనుచు చక్కగ జేరవచ్చి
'లేలెమ్మ చారుమతీ లెమ్ము లె' మ్మనుచు
చేదట్టి లేప నాచేడెదద్దరిలి
దిగ్గునదాలేచి దెలివంది చూచి
'తల్లి! నీవెవ్వరో దయయుంచి చెపుమ'
అనగ నావరలక్ష్మి యతిప్రేమతోడ
వైకుంఠవాసిని వరలక్ష్మి నేను
హరికి బట్టపురాణి నబల వినవమ్మ
నీ చిత్తశుద్ధికి నీభక్తికలరి
నిను బ్రోవవచ్చితి నిజముగానమ్మ
చేరి శ్రావణ శుక్రవారమ్మునందు
పున్నమి ముందు నన్ పూజింపవమ్మ
మునిమాపునను స్నానమొనరించి శుచిగ
పంచకల్వాలు దెచ్చి భక్తితో నిలిపి
నవసూత్రమునుగట్టి నవపూపములను
నైవేద్యమిడి వాయనమ్ము నిడవలెను
ఇదియె లక్ష్మీవ్రతం బిదియె సుకృతము
యిదియె శుభప్రదం బింతులకునెల్ల
గాన నీరీతి నీమానసంబొప్ప
చేరిగొల్చెద వేని సిరులనిచ్చెదను
ఆయురారోగ్యంబు లఖిలసంపదలు
కోరినవెల్ల చేకూర్తు నీకబల
అన్నింటికంటె నాకతిప్రీతి వినుమ
కరువైన జనులను కరుణించి నీవు
గలవానిలో నింత గంజైనబోసి
యారాట ముదుపులేవని యెంచికొనుము"
యనవిని యాసాధ్వి య దరిపడిలేచి
తనలోన దలపోసి దా జోద్యమంది
విభ్రాంతియో నిజమొ వింతగాదో చె;
నలుదిక్కులనుగాంచి దెలతెల్లబోయి
దానేడ వరలక్ష్మి దనకనుల యెదుట
గానంగ బడులేడ? గలగంటిననుచు

పేసవదాలేచి వెలదులజూచి
స్వప్నవృత్తాంతమ్ము చక్కగా దెలిపి
అది శ్రావణంబగుట మదిలోన దలిసి
ముదమొప్ప పున్నమి ముందుగావచ్చు
శుక్రవారమునాడు శుభముహూర్తమున
తమ తమ యిండ్ల ముస్తాబుగావించి
భక్తిశ్రద్ధలతో నా భామలందరును
కలలోన దెలిపిన క్రమమొప్పగాను
వరలక్ష్మి సేవించి సరిలేనిసిరుల
గలిగి వర్ధిల్లిరి గాన మాయమ్మ
శ్రీలక్ష్మిగొల్వ మీ చెదరని భక్తి
తల్లి దేవతలెల్ల దనయుండనుండ
మనభక్తిశ్రద్ధల గనుచుందురమ్మ.
చిత్తశుద్ధిగలేని స్త్రీలకెన్నటికి
చిత్తంబునకు శాంతి చేకూరదమ్మ.
దుష్టబుద్ధులు లోన దొలగింపుమన్న
కష్టములు మనకెపుడు గలుగబోవమ్మ.
కోపంబు తాపంబు కూడదెన్నటికి
పాపహేతువులవే పరికింపవమ్మ".
రాగబుద్ధులు మదికి రానీయకమ్మ.
సకలభూతములందు సమబుద్ధితోడ
మెలగుచుండుటకు నీవలవాటు పడుమ.
మనచిత్తమున శుద్ధిగన కోరకున్న
వ్రతము లెన్నెన్ని సమ్మతి జేయుచున్న
దానధర్మము లెంతతగ జేయుచున్న
విను దేవతల కృపన్ గనలేమునుమ్మ.
ముమ్మాటికిది నిజము నమ్మమాయమ్మ
అనుతల్లి పల్కులువిని భ్రమరాంబ
కడుసంతసము నంది కడలేనిభక్తి
నేటేటవరలక్ష్మి నెలమి పూజించి
అఖిలసంపదలతో నలరారుచుండె.

# శిల్పి

శ్రీ గంగాధరభట్ల సుశీలాదేవిగారు

ఓ శిల్పి ఓ శిల్పి
లావణ్య శిల్పి
లలితంపు కళలతో
రాణించవోయ్.

చిత్రాతి చిత్రముల
చెక్కడాల్ పనులుండ
చక్కని చుక్కల
నగ్న భంగిమ లెల్ల
చిత్రింపనున్నావ? ॥ఓ శిల్పి॥

నీచమైన నగిషీల నాణ్యంపు పనులుండ
విడిచేసి వనితల విన్నాణభంగిమల
కఠినంపు శిలలపై కనుపరుప నున్నావ? ॥ఓ శిల్పి॥

బట్ట కట్టును లేక బండబూతుల తోటి
నవకంపు పడతుల నాణ్యంపు మానాలు
వివిధ దృశ్యాలలో విప్పిచూపిస్తావ? ॥ఓ శిల్పి॥

పర దేశ పద్ధతులు పై పెట్టుకొని నీవు
పరమ పావనమైన భారతావనిలోన
నీశిల్ప చాతురీ విన్యాసములనెల్ల
పడతులను చిత్రింప పనిపెట్టుకొన్నావ? ॥ఓ శిల్పి॥

భారతావనిలోన వెలలేని విలువగల
మానాల రక్షణకు ప్రాణాలు విడచిన
వీరనారుల కథలు విన లేద నీవింక?
ఓ శిల్పి, ఓశిల్పి, లావణ్యశిల్పి!
లలితంపు కళలతో రాణించవోయ్.

## వరలక్ష్మీ వ్రతం

ఘల్లు ఘల్లుమనుచు చక్కగా జేరవచ్చి
'లేలెమ్ము చారుమతీ లెమ్ము లె' మ్మనుచు
చేదట్టిలేప నా చేడె దద్దరిలి
దిగ్గున దా లేచి దెలివంది చూచి
'తల్లి ! నీవెవ్వరో దయయుంచి చెపుమ'
అనగ నా వరలక్ష్మి యతిప్రేమతోడ
వైకుంఠవాసిని వరలక్ష్మి నేను
హరికి బట్టపురాణి నబల వినవమ్మ
నీ చిత్తశుద్ధికి నీభక్తికలరి
నినుబ్రోవవచ్చితి నిజముగానమ్మ
చేరి శ్రావణ శుక్రవారమ్మునందు
పున్నమి ముందు నన్ పూజింపవమ్మ
మునిమాపునను స్నానమొనరించి శుచిగ
పంచకల్వాలుదెచ్చి భక్తితో నిలిపి
నవసూత్రమునుగట్టి నవపూపములను
నైవేద్యమిడి వాయనమ్ము నిడవలెను
ఇదియె లక్ష్మీవ్రతం బిదియె సుకృతము
యిదియె శుభప్రదం బింతులకునెల్ల
గాన నీరీతి నీమానసం బొప్ప
చేరిగొల్చెదవేని సిరులనిచ్చెదను
ఆయురారోగ్యంబు లఖిలసంపదలు
కోరినవెల్ల చేకూర్తు నీకబల.
అన్నింటికంటె నాకతిప్రీతి వినుము
కటువైన జనులను కరుణించి నీకు
గలదానిలో నింత గంజైనబోసి
యారాట ముదుపుజేసెనని యెంచికొనుము"
యనవిని యా సాధ్వి యదరిపడిలేచి
తనలోన దలపోసి దా జోద్యమంది
విభ్రాంతియో నిజమొ వింతగాదో చె;
నలుదిక్కులనుగాంచి దెలతెల్లబోయె
దానేడ వరలక్ష్మి దనకనుల యెదుట
గానంగ బడుటేడ ? కలగంటిననుచు
వేకువదా లేచి వెలదులజూచి
స్వప్నవృత్తాంతమ్ము చక్కగా దెలిపి
అది శ్రావణంబగుట మదిలోన దెలిసి
ముదమొప్ప పున్నమి ముందుగా వచ్చు
శుక్రవారము నాడు శుభముహూర్తమున
తమ తమ యిండ్లు ముస్తాబుగావించి
భక్తిశ్రద్ధలతో నా భామలందరును
కలలోన దెలిపిన క్రమమొప్పగాను
వరలక్ష్మి సేవించి సరిలేని సిరుల
గలిగి వర్ధిల్లిరి గాన మాయమ్మ
శ్రీలక్ష్మి గొల్వ మీ చెదరని భక్తి
తల్లి దేవతలెల్ల దన యుండనుండ
మనభక్తిశ్రద్ధల గనుచుండురమ్మ.
చిత్తశుద్ధిగలేని స్త్రీలకెన్నటికి
చిత్తంబునకు శాంతి చేకూరదమ్మ.
దుష్టబుద్ధులు లోన దొలగింపుమన్న
కష్టములు మనకెపుడు గలుగబోవమ్మ.
కోపంబు తాపంబు కూడదెన్నటికి
పాపహేతువులవే పరికింపవమ్మ.
రాగబుద్ధులు మదికి రానీయకమ్మ.
సకలభూతములందు సమబుద్ధితోడ
మెలగుచుండుటకు నీవలవాటు పడుము.
మనచిత్తమున శుద్ధిగన నేరకున్న
వ్రతములెన్నెన్ని సమ్మతి జేయుచున్న
దానధర్మము లెంతతగ జేయుచున్న
విను దేవతల కృపన్ గనలేముసుమ్మ.
ముమ్మాటికిది నిజము నమ్ము మాయమ్మ
అనుతల్లి పల్కులు విని భ్రమరాంబ
కడుసంతసము నంది కడలేని భక్తి
నేటేటవరలక్ష్మి నెలమిపూజించి
అఖిలసంపదలతో నలరారుచుండె.

# స్త్రీలకు కావలసిన అలంకారములు

'సరస్వతి'

15-6-49 "గృహలక్ష్మి" లో "స్త్రీలు అలంకారములు" అన్న వ్యాసం చదివాను. దానిమీద నా అభిప్రాయములు తెలుపుచున్నాను.

ఆ వ్యాసంలో అలంకారముల గురించి ఇచ్చిన ఉపమానములను పరిశీలిద్దాం. అలంకారం అనగా ఏమిటి? దాని నిర్వచన మేమిటి?

వీరినిర్వచన ప్రకారము అయితే స్త్రీ తన శరీర అందమునకు కావలసిన పరికరములను చేర్చుకొనుటే అలంకారము. వీరిచ్చిన అలంకారదృష్టి భావమునకు, గుణమునకు, సహజమైన అందమునకు ప్రాధాన్యత నిచ్చుటలేదు. పూర్తిగా హిందూమతమును పోషించుచు అలంకారములను మతముతో ముడిపెట్టుచున్నారు. ప్రస్తుతం సమాజంలో ఉన్న అలంకారములన్నియు ఏదో ఒకమతమునకు సంబంధించిఉన్నవి. అన్ని అలంకారములను అన్నిమతములు కలసి ఒప్పుకోవు.

వీరు బొట్టు మెదడునరములన్నింటిని సమకూర్చి ఏకాగ్రత నిచ్చునని, ముత్యం, పొగడం, బంగారం, శరీరమునకు ఆరోగ్యకరములని అందువలన ప్రాచీనకాలమునుండి ఈ అలవాట్లను అభ్యసించుచున్నారని వ్రాసిరి. నిజముగా యివన్నియు ఆరోగ్యకరమైనప్పుడు, ప్రతిమానవునకు ఆరోగ్యం అవసరము గనుక, అందరూ ఆచరించవలెను. అందరిసంగతి అటుండనిచ్చిన, స్త్రీలందరైననూ ఆచరించుటలేదు. క్రైస్తవులు, మహమ్మదీయులు, హిందువులలోని వితంతువులు బొట్టును పెట్టుకొనరు. వారికి నరములు చెదరిపోవుచున్నవా? ఆరోగ్యము అక్కరలేదా?

ఈవిధంగానే గర్భవతులైన స్త్రీలు గ్రహణములు చూడకూడదనీ, ఆసమయంలో కదలకూడదనీ, పడుకొని యుండవలెననీ లేనిచో కడుపులోని పిల్లలకు మొట్టివచ్చుననీ, స్త్రీకడుపులోని బిడ్డకు సూర్యచంద్రాదులైన గ్రహములకు సంబంధంకలదనీ హిందూసంఘంలో వాడుక. బొట్టుకు మెదడు నరములకు గల సంబంధం వంటిదే దీనికికూడాను.

హిందూస్త్రీలు కానివారిలో ఈ గ్రహణసంబంధమైన నమ్మకాలేమీలేవు. అందుచేత వారు ఆగ్రహణసమయంల్లో మామూలుగా అప్పుడు ఏపనిచేస్తున్నారో దానిని వీడక కొనసాగిస్తూనేఉంటారు. అది తిరుగుతూ ఉండడము కావచ్చు. ఆసమయంలో వారు కూరగాయలు తరుగుతూ ఉండవచ్చు. వారిపిల్లలకు మొట్టివచ్చునను భయము వారికిలేదు. మొట్టివచ్చుటే నిజమయినట్లయితే అందరి గర్భిణీస్త్రీలకు ఒకేవిధముగా ఉండవలెను. నిప్పుముట్టుకుంటే ఒకరికి కాలి యింకొకరికి కాలకుండునా? అందువల్ల యివన్నియు మూఢనమ్మకాలు.

నేను కూడా ఈనమ్మకములను పరీక్షచేయుటకు ప్రయత్నించాను. ఆసమయంలో కొలంబోలో ఉంటూ ఉండంచేతనున్నూ అచ్చటి ప్రజలలో ఈమూఢాచారము లేకపోవుట చేతనున్నూ నాకు పరిశోధన చేసి దీనినిజమును తెలుసుకొనవలెనని జిజ్ఞాసఏర్పడినది. ఆగ్రహణసమయంలో నేనుమామూలుగా తింటూతిరుగుతూనేఉన్నాను. తర్వాత ప్రతిసారి గర్భిణీతోయున్నప్పుడూ గ్రహణము వచ్చినప్పుడుచూచుట, కూరగాయలు కత్తిపీటతో తరుగుట చేసితిని. నాకుకలిగిన సంతానమునకు ఏవిధమైన మొట్టులూలేవు. నేనుచేయుటే కాక యింకా ఈనమ్మకం కలిగిఉన్న యితర స్త్రీలతోకూడా చేయించి నచ్చజెప్పేసరికి నిజస్థితి తెలుసుకుని భయాన్ని వీడారు.

యిదేవిధమైనటువంటి అనేక మూఢనమ్మకాలు హిందూమతంలో ఉన్నాయి. వీటినన్నింటిని జరుపక పోతే ఏదో ఒకకీడు జరగుతుందని ముడిపెట్టారు. యిట్టివే వాస్తుశాస్త్రం, శాంతి, మొదలైనవి. యిల్లు వాస్తుశాస్త్రం ప్రకారం కట్టకపోతే ఏమేస్త్రీయో చనిపోతాడని, లేకపోతే ప్రక్కింటి వారికి కీడుకల్గుతుందనీ, లేక ఆయింటి యజమానికి ప్రాణాపాయం కల్గుతుందని అంటారు. యిది అబద్ధమని ఈరోజులలో చాలమందికి తెలిసింది. పూర్వకాలం ఆశాస్త్రం అనుసరించి కట్టబట్టే యింట్లోకిగాలి, వెలుతురు ప్రవేశించవు.

ఇంకా ఆవ్యాసములో పాశ్చాత్య స్త్రీలను విమర్శించుతూ వారు యిహపరములను చూచుకొనక వచ్చినదంతా అనుభవించుదురనిరి. ప్రతీవారిలో మంచీ, చెడ్డా రెండూ ఉండును. అయితే ఏది సంఘమునకు ఉపయోగ పడునో చూడాలి.

పాశ్చాత్యస్త్రీలు హిందూస్త్రీలవలె కూపస్థ మండూకాలుకారు. వారు ఈరకములైన మూఢనమ్మకాలను, అలంకారములను, అజ్ఞానమును అనుసరిస్తూ యిదేసరిఅయినదని తృప్తిపడరు. విచక్షణాజ్ఞానంతో వ్యవహరిస్తారు. తల్లి తండ్రుల ఆస్తిపైగాని, యితరుల సహాయంపైగాని ఆధారపడక తమస్వతంత్ర జీవనం గడుపుకొనుటకు యత్నిస్తారు. తమపిల్లలకుకూడా స్వతంత్రజీవనమునకు అవసరమగువిద్య, విజ్ఞానం కలిగిస్తారు. భయం కాకుండా ధైర్యాన్ని, సాహసాన్ని వారికి నేర్పుతారు. అందుచేతనే హిందూస్త్రీకంటె వారిలో విజ్ఞానం హెచ్చు, ధైర్యం హెచ్చు, జిజ్ఞాసాయుత పరిశోధనాదృష్టి హెచ్చు.

వారిలోని అలవాట్లన్నిటిని ఆచరించమని నేననను, కాని మనలోని అలంకారములు వారికి లేనంతమాత్రమున, మనకున్న మూఢనమ్మకములు వారికి లేనంతమాత్రమున లేకమనం అలవాటుపడియున్న బానిసభావం వారిలో లేనంతమాత్రమున వారు తీసిపోలేదు.

యింకను ఆవ్యాసములో దైవము పుట్టుకతోనే స్త్రీలకు లజ్జ, సౌకుమార్యము మొదలగున వన్నియు యిచ్చెనని, పాశ్చాత్య స్త్రీలవలె కాక యిహపరములను చూచుకుంటూ యింటిని, ఒంటిని అలంకరించుకొంటూ ప్రాతపద్ధతులను పోషించుకొనుటే ఆదర్శవనితల లక్ష్యమనిరి.

యీరోజులు వ్యక్తిగత సౌఖ్యాన్ని మాత్రమే చూచుకోనివ్వవు. సంఘక్షేమము ముందుఆలోచించవలెను. సమస్తమానవకోటి ఆకలితో, నగ్నత్వంతో, బానిసత్వంతో పోరాడుతూ ఉండగా ఎవరికివారు అలంకరించుకొని తమగృహమును భూలోకస్వర్గము చేసుకొనుటకు వీలులేదు.

అందువలన స్వతంత్రభారత పౌరులమైన మనము సమాజాన్ని, ప్రపంచాన్ని సౌఖ్యవంతం చేయుటకుగాను ధైర్యము, సాహసములను అలంకరించుకొనవలెను; పట్టుదల, కార్యదీక్షలను గుణములుగా చేసుకొనవలెను. మూఢనమ్మకములు, దైవవిశ్వాసములను వదలి తోటిస్త్రీలకు జ్ఞానము కలిగించవలయును.

ఎంతచక్కగా అలంకరించుకున్నను ఏదేని కష్టము తటస్థించినపుడు ఎదుర్కొన ధైర్యములేక వెనుకంజవేసిన శోభిల్లునా?

తోటిమానవుల ఆర్తనాదములు వినుట అలవాటు చేసుకుని ఊరకుండుట శీలమనిపించుకొనునా?

వ్యక్తిగత ఆనందం, సామాజిక సౌఖ్యమునకు అడ్డురానంత వరకే. ఎవరికి వారే తమతమ అధిక అవకాశములను ఉపయోగించుకొని ఆయాస్థాయీలను బట్టి అలంకరించుకొని కూర్చుంటే, ఆ అవకాశములు లేని ఎందరో సోదరీమణులు ఏంగాను?

అందుచేత చదువుకున్న స్త్రీలే యిట్టిభావప్రచారమునకు ఒడిగట్టితే వెనుక బడియున్న స్త్రీజాతి మరీ అధ్వాన్నము కాగలదు.






ఆర్యపుత్రీ గుమ్మం కాశావా ?
అవును నెల మొదలు.
అయితే ఏం - మామూలే
గొర్రెతోక నాజీతం-
కోర్కె చెల్లు - విధం - లేదు
చీరెను నే కొనలేను.
"మామూలే ఈభాష"
అని నవ్వేను - నాభార్య !



పాలవాడికెంత ?
రెండునెలలు బాకీ ;
ఇప్పుడే వచ్చాడు
ఇంటివాడు కూడాను.
అప్పులవిముక్తి ఎప్పుడయ్యా ?
చీరెలు తెచ్చే దెన్నడయ్యా ?
భార్య అన్నది తీవ్రముగా-
ఆగవే రెండ్నెల్లూ-
కష్టాలన్నీ మాయమౌతయి-
చీరెలు, నగలూ కొంటాను-
"అయితే చాలా బాగుంది"
అన్నది తీపిగ నా గృహలక్ష్మి !



ఆశ్చర్యం - భగ్నం మనప్లాను
(దీనినే మూడునెలల ప్రణాళిక అంటారు)

తగ్గించివాడినా - హోటలులో బిల్లు
పెరిగింది బాగా -
కిల్లీ కొట్లో కొంతయు - కూర్చుంది.
బిల్లులతో తలనొప్పి -
వైద్యునిబిల్లు - ఇంకోటి
"చెప్పా, ఎప్పుడైనా - వదన్నా,
లేదన్నానా"
అర్థం కాదు; డబ్బంతా ఏమైపోతున్నదో-
ఆగవే - 'నెక్స్టుమంత్ నీకోర్కె'
"అంతే లెండి" అన్నది నా: భార్య !
సారీగా నిట్టూర్చి.



విసుగు చెందకే - వీరనారికో
భార్యాభర్తలకుండే - కష్టాలూ -
అర్థంచేసుగు ఆర్యా -
నా ఓర్పును కనవయ్యా
ఇప్పటికైనా చీరెను తేవయ్యా -
ఒకనిముషంలో వస్తానూ -
బజారు కెళ్లి తెద్దాము -
నచ్చిన చీరెను కొందాము.
తీరనికోరిక తీరింది, అన్నది తియ్యని కాఫీ
ఇస్తూ నా వరలక్ష్మి !

ఎమ్. ఎస్. ఎమ్.

# —: శాకుంతలమున శకుంతల :—

శ్రీ మొదలి వెంకటరామయ్యగారు



(గతసంచిక తరువాయి)

మదన సంతప్తయయ్యు శకుంతల తన మనోనిశ్చయమును మరువలేదు.

"యతః ప్రభృతి మమదర్శన ప్రథమాగత స్స తపోవన రక్షితా రాజర్షిః తతః ప్రభృతి తద్గతేనాభిలాషేణైతదవస్థాస్మి సంవృత్తా! యథాతస్య రాజర్షే రనుకంపనీయాభవామి తథావర్తేథాం; అన్యథా అవశ్యం సించతం మే ఉదకం"

అని తననిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చినది. ఆమె మనస్సెంత గాఢముగ దుష్యంతునియందు లగ్నమైన దను విషయము నొక్క మాటలోనే వ్యక్తపరచెను.

"సాగరం వర్జయిత్వా కుత్ర వా
మహానద్యవతరతి?"

యను ప్రియంవదా వాక్యమెంత సొగసైనది! సాగర సంగతయగు మహానది వేరు దిరుగునా? యనిధ్వని. దుష్యంతాసక్తమగు శకుంతలాహృదయ మన్య పురుషులవైపు మరలునా? అనురాగ మంతటి గాఢమైనది గావుననే—

"తవనజానే హృదయమ్ మమ
పునః కామో దివాపి రాత్రిమపి
నిర్ఘృణ! తపతిబలీయ స్త్వయి
యుక్తమనోరథాయా అఙ్గాని"

యనుమదన లేఖయందు దుష్యంతుని "నిర్ఘృణ!" యని సంబోధించు నంతటి స్వాతంత్ర్య మామెవహించినది. సంగమోత్సుకుడగు దుష్యంతుడు తనయెదుట మోకరించి తన ప్రేమభిక్ష నర్థించుచు తన కుపచారములుసల్ప సంసిద్ధుడై యున్నను ఆమె తన మనోభావమును గుప్తపరచి:—

"హలా! కిమన్తః పుర విరహ పర్యు
త్సుకస్య రాజర్షే రుపరోధేన"

యనితన చమత్కార వచనములచే నాతని హృదంతరమును పరీక్షించి:—

"పరిగ్రహ బహుత్వేపి
ద్వేప్రతిష్ఠే కులస్యమే
సముద్ర రశనాచోర్వీ
సఖీచ యువయోరియమ్"

యని యాతనిచే వాగ్దానమును చేయించు కొనినది. ఇట్టియామెను ప్రౌఢ యనవలదా?
నేపథ్యమున:—

"చక్రవాకవధూకే! ఆమన్త్రయస్వ
సహచరమ్; ఉపస్థితా రజనీ"

యన్నమాటలు వినబడగనే గౌతమిరాకను గమనించి

'పౌరవ! అసంశయమ్
మమ శరీరవృత్తాన్తోపలంభా
యార్యా గౌతమీ ఇతఏ
వాగచ్ఛతి, తావద్విటపాన్తరితోభవ!"

అని దుష్యంతుని విటపాన్తరితుని గావించి లతావలయముల నాతనిపైగప్పి గౌతమియెదుట నేమియు నెరుగనియట్లు శరీరబాధ నభినయించు శకుంతలయొక్క చాకచక్య మాశ్చర్య జనకముగదా! కడకు గౌతమీ సహితయై లతామండపమునుండి నిర్గమించు నపుడు దుష్యంతు నుద్దేశించి యన్యాపదేశముగ:—

"లతావలయ! సంతాపహారక! ఆమం
త్రయేత్వాం భూయోపి పరిభోగాయ"

యనునామె పల్కుల యందలి ధ్వని ప్రాగల్భ్యమును

గమనింపుడు. ఇట్టి ప్రౌఢాలక్షణముల జూపి ముగుని గావించి, చేజిక్కియు చమత్కారముగ తప్పించుకొని పోవుటవలన ఆమెనుద్దేశించి దుష్యంతుడు:—

"అహో విఘ్నవత్యః ప్రార్థితార్థసిద్ధయః"

యనివాపోయెను.

ప్రథమాంకమున వృక్షసేచనమొనర్చుచు భ్రమర దర్శనమాత్రమున కాతరితయైన శకుంతల క్రమముగా తనమార్గ్యమును వీడి; తనచమత్కార వచనములతోను, శృంగార చేష్టలచేతను నాయకుని తనకు వశవర్తినిగ జేసికొని యాతని వలచి యాతనిచే వలపించుకొనెను. శకుంతలవినా ప్రపంచమంతయు మిథ్యయను భావ మాతనికికల్పించినది. పైవిషయముల గమనించినచో-

"స్త్రీణామ శిక్షిత పటుత్వ
మమా నుషీషు సంద్రృశ్యతే;
కిముతయా ప్రతిబోధవత్యః"

అను దుష్యంతుని యనుభవ పూర్వక వచనములద్రోసి పుచ్చగలమా? నాయకుని చిత్తవృత్తి ననుసరించి కాళి దా సీపాత్రమునందు క్రమ పరివర్తనమును చిత్రించుట యాతని పాత్రీకరణ శక్తికి తార్కాణము.

భర్తృగతచింతచే తనశరీరమునే విస్మరించియున్న శకుంతలకు శాపప్రాప్తియు, శాపావధియు తెలియవు. కుసుమసుకుమారమగు నామె హృదయమును అశని పాతతుల్యమగు నీవార్తచే నొప్పింప కుండుటయే సమంజసముగనున్నది.

"యదినామ సరాజా ప్రత్యభిజ్ఞాన
మన్థరో భవేత్; తతోస్మా యిద
మాత్మనామధే యాఙ్కిత మఙ్గుళీ
యకం దర్శయ"

అనుచు సఖులు దుష్యంత నామాంకితమగు నంగుళీయ కము నీయగనే శకుంతల హృదయము భయకంపితమ య్యెను. తాదృగనురాగ యుక్తుడగు పతివిషయమున సఖులిట్లు పల్కుటకు కారణమేమను సందేహామామె కుతోచినది. కాని—

"మాబిభీహి; అతిస్నేహః పాపశంకీ"

అని సఖులే యాసందేహమును బాపిరి. ఇట్టియధీర హృదయకు శాప వృత్తాంతమే తెలిసి యుండినచో నామె జీవించునా? అట్లే జరిగిన నాడు నాటకము విషాదాంతమై భరతోత్పత్తి కవకాశమేర్పడదు. విప్ర లంభము కొరకు కల్పింపబడిన శాపవృత్తాంతము గుప్త మొనర్పబడుట కిదియే కారణము.

అత్తవారింట సకల భాగ్యంబులున్న
మగనిపైనను తన్న కెంత మక్కువున్న
ఆడుపుట్టువు పుట్టింటి కాసపడును"

అని విజయ విలాసకారు డన్నట్లు తనచాకచక్యము చే నొక మహారాజుయొక్క ప్రేమనుసంపాదించి యాతని గృహిణియై అతుల విభవముల ననుభవించుచు ప్రేమ సామ్రాజ్యము నేలవలయు నను మధుర భావములతో హస్తిపురమున కేగ తొందరపడు చున్నను, బాల్యము నుండి తనను పెంచిన కణ్వుని, ఛాయలవలె తన్ననుస రించి తిరుగు సఖీజనులను, సోదరస్నేహముతో తాను పెంచిన యాశ్రమ వృక్షములను, చిరపరిచితమగు తపోవనమును వీడిపోవుటకు శకుంతల మనసొప్పలేదు.

"హలా ప్రియంవదే! నన్వార్యపుత్ర దర్శనో త్సుకాయా అప్యాశ్రమం పరిత్య జన్త్యా దుఃఖేన మే చరణౌ పురత ప్రవర్తేతే"

అని యతికష్టముతో నాశ్రమమును బాయు శకుంతల నుగాంచిన నేసామాజికుని కన్ను చెమ్మగిలకుండును?

'వనజ్యోత్స్నే! చూతసఙ్గతాపిమాం ప్రత్యాలిఙ్గతో గతాభి శ్శాఖా బాహుభిః అద్య ప్రభృతి దూర పరివర్తినీ తే ఖలు భవిష్యామి"

అని తనకు ప్రీతిపాత్రమగు నవమాలికయొద్ద వీడ్కోలు వడసినది. తండ్రిని కౌగలించుకొని—

"కథమిదానీం తాతస్యాఙ్కాత్ పరిభ్రష్టా మలయతటోన్మూలితా చందనలతేవ దేశాన్తరే జీవితంధారయిష్యామి"

అను నామె దిన వచనములు పాఠకుని హృదయమున ప్రతిధ్వనించును. మఱల తపోవనమును చూచుటెప్పుడోయని దిగులుపడెను. కడకు దుఃఖమున వెనుదిరిగి చూచుచు, బరువెక్కిన హృదయముతో ఆశ్రమమును వదలినది. ఆడుబిడ్డలకు పుట్టినింటి యందుగల మమకార మీఘట్టమున కన్నులకు కట్టినట్లుండును.

శకుంతల రాజసభలో నిలచి సింహాసనారూఢుడై యున్న దుష్యంతునితో వాదించి తా నాతని ధర్మపత్నియని నిరూపించుకొన్నట్లు మూలమున నున్నది. నాటకమునగూడ నామెను పైవిధముగనే ప్రదర్శించి యుండినచో నామెయొక్క మహత్త్వము వెల్లడియై యుండుననియు, కాళిదాసట్లు గాక ఏకాంతముననున్న దుష్యంతుని యెదుట నీపాత్రమును ప్రవేశపెట్టుట వలన పాత్రమునకు పాటవము తగ్గినదనియు కొందరి యభిప్రాయము.

పైయభిప్రాయమును గురించి చర్చించునపుడొక విషయమును గమనించుట యవసరము. కవులు భిన్న దృక్పథములు గలిగియుందురు. మూలకారునియొక్కయు ఆమూలమునందలి యితివృత్తమును గ్రహించి నూత్న కావ్యమును సృష్టించు కవియొక్కయు ఆశయములును, అభిరుచులును భిన్నములై యుండవచ్చును. కాళిదాసు మూలమునందలి యితివృత్తమున —

(1) దుష్యంతుడు కణ్వాశ్రమమున శకుంతలను గాంచుట.
(2) వారి పరస్పరానురాగము.
(3) గాంధర్వ వివాహము.
(4) భరతోత్పత్తి.
(5) శకుంతల భర్తృ తిరస్కృత యగుట.
(6) పునస్సమాగమము.

అను నీయంశములను స్థూలముగ గ్రహించి వానిని దృశ్యకావ్యానుగుణముగ ప్రపంచించి రసపోషకములగు నూత్న సన్నివేశముల జేర్చి, శృంగారరసమే శాకుంతల నాటకరూపమును దాల్చినదో యనునట్లు సహృదయ రంజకమగు నొక ప్రత్యేకమును, అఖండమును అగు కావ్యమును సృష్టించినాడు. ఇట్టి ప్రత్యేక విశిష్టతగల కావ్యమును యాథాతథముగ, మూలనిరపేక్షకముగ, విమర్శించుట యుక్తము. మూలరహితములైన స్వతంత్ర కావ్యముల నెట్టిదృష్టితో విమర్శింతురో అట్లే మూలసహిత కావ్యముల గూడ విమర్శింపవలయును. మూలముతో పోల్చి విమర్శించునపుడు కొన్నిపట్ల నూత్నకావ్యకర్తకు న్యాయము లభింపక అతడు కావ్యప్రపంచమున నొనర్చిన పరిశ్రమ వ్యర్థమగును.

స్త్రీలు వ్రీడావతులు గాన పదిమంది పురుషుల కభిముఖముగా నిలచి మాటలాడ సాహసింపజాలరను విషయము సర్వవిదితము. శకుంతల నాగరకవాసనలేని తాపసాశ్రమమున బెరిగిన యువతి. హస్తిపురము జేరువరకు నామె నగరవాసుల జూచియుగాని, మాటలాడియుగాని యెరుగదు. ఉన్నత సౌధములును, విశాలోద్యాన వాటికలును, జనసంకీర్ణములగు రాజపథములును గల రాజధానిని ప్రవేశింపగనే యామె విభ్రాంతయగుట యాశ్చర్యముగాదు. పురుషులగు శార్ఙ్గరవ శారద్వతులే జనాకీర్ణమగు నగరమును గాంచి యగ్నిపరీత గృహమనుకొని బెదురుచుండ బాలికయగు శకుంతల జడియుట యొక లెక్కయా? ఇట్టి యామెను మంత్రి సామంతాది పరివార పరివృతుడై పేరోలగముననున్న దుష్యంతుని సభామధ్యమున నిలపి యాతనితో వాదింపజేయుటలో ఔచితి గలదేమో సహృదయులే నిర్ణయింతురుగాక! ఆమె వాద ప్రతివాదములు జేసెననుట యథార్థమగునా? కావుననే యథార్థ చిత్రణము నాశించి కాళిదాసామెకు అగ్నిశరణమున దుష్యంతుని దర్శన మిప్పించెను.

అగ్నిశరణ ప్రవేశ సమయమున గలిగిన భావిభర్తృతిరస్కారసూచకమగు దక్షిణాక్షి స్పందనమామెను కలవరపరచినది. ఆయశుభ నిమిత్తమునకు హృదయము వడకుచున్నను పతిని చూడవలయునను నుత్సాహము కలిగి యుండుటచే—

"హృదయ! కిమేవం వెపసె? ఆర్య పుత్రస్యభావ మనధార్య ధీరం తావద్భవ"

అని తనకుతానే ధైర్యమును చెప్పుకొనెను. శార్ఙ్గరవ శారద్వతులు గురుసందేశమును వినిపించి తన్నప్పగింపగనే ఆతురతతో దుష్యంతుని యంగీకారమున కెదురుజూచినది. నిస్సారములగు

"కించాత్ర భవతీ మయా పరిణీతపూర్వా?"

యను నాతని పల్కులామెకు సంతాప కారణములైనవి.

'అత్రభవతీ'

యను సగౌరవ సంబోధనము నామె సహింపలేకపోయినది. కణ్వశిష్యుల పల్కులు నిరాకరింప బడినవి. దుష్యంతుడు తన నంగీకరించునట్లు కాన్పించుటలేదు.

"ఆర్యస్య పరిణయ ఏవ సందేహః; కుతో మే దూరాధి రోహిణ్యాశా"

యనితన మధుర స్వప్నములకు స్వస్తి జెప్పినది. ఇంకను ప్రయత్నింప దలచినది. స్వరూపముచైన జూచి గ్రహించునేమో యని యవగుంఠనమును తొలగించుకొనెను. ఫలము కాన్పింపలేదు.

"వక్తవ్య ముక్త మస్మాభిః; దీయతా మస్మై ప్రత్యయ ప్రతివచనమ్"

అని శారద్వతు డొకవంక తొందరించుచున్నాడు. తప్పనిసరిగ సంభాషణమున కుపక్రమించినది. భర్తయను భావమున "ఆర్యపుత్ర" యని యుపక్రమించి ప్రస్తుత పరిస్థితి స్మరణకురాగా "పౌరవ" యని మార్చుకొని తన దీనావస్థను విన్నవించుకొని పరిగ్రహింపు మని బ్రతిమాలెను. అభిజ్ఞానమును జూపి నైన యొడబరుప జూడగా దురదృష్టవశమున నది జారిపోయెను. ఆశ ఇంకను వదలలేదు. ఆశ్రమమున నిరువురకును జరిగిన యొక రహస్య వృత్తాంతమును బ్రకటించినది. అతని గుండె కరుగలేదు. పైగా

"ఏవమాదిభి రాత్మ కార్య నిర్వర్తినీ నామనృత మయ వాఙ్మధుభి రాకృష్యన్తే విషయిణః"

యని ఎకసక్కెముగ మాటలాడు దుష్యంతునిపై నామె కేవగింపు గలిగినది. తిరస్కార రూపావమానమున నొడలు జెలియని కోపముతో భర్తయను భావమును వీడి "తృణచ్ఛన్న కూపోపము" డనియు "పయోముఖ విషకుంభ" మనియు, "కితవు" డనియు, "అనార్యు" డనియు దుష్యంతు నాతని ముఖముననే దూషించినది. కాని భర్తృతిరస్కృతయగు తానెచటి కేగ గలదు? మరల తండ్రికడ కేగుద మనుకొనగా శిష్యులామె నదల్చి యొంటరిగ డించివెడలిరి. అంతయు నామె కగమ్యముగ నుండినది. మన మంధకార పూరితమైనది. దిక్కు తోచలేదు. అవమానితయై తానింకను దుష్యంత పురోహితునింట తలదాచుకొనుట నీచమని భావించి

"భగవతి వసుధే! దేహిమే వివరమ్;"

అని మరణము నాకాంక్షించినది.

పతి యనుగ్రహము వడయుటకు శకుంతల గావించిన ప్రయత్నములును, క్షణక్షణము నకును ప్రతికూల చిహ్నములే గాన్పించుచున్నను, ఆశను వీడజాలక పోవుటయు, తనజీవితమున నూహింపని సంఘటనము జరిగినందుల కామెపొందిన చిత్తసంక్షోభమును నిట ప్రదర్శితములు.

గర్భవతియు, నభిమాన వతియు గాన నామె నొరులయొద్దనుంచక పితృతుల్యుడగు మారీచుని యండ జేర్చుట శ్లాఘ్యము. చిరవియోగమున విసిగి ప్రాణముల విడచునేమోయను భయమున మేనక సానుమతీ మూలమున దుష్యంతోదంతమును శకుంతల కెరిగించుచుం డుట వలననే యీపాత్రము మరల సప్తమాంకమున మనకు ప్రత్యక్షము గాగల్గినది.

రక్షాకరండ వృత్తాంతమును వినగనే మరల శకుంతల కాశ యుదయించినది. సానుమతీ సందేశ మపుడు జ్ఞప్తికి వచ్చినది. దుష్యంతునికొఱ కెదురుచూచిచూచి

విసిగియున్నది గావున ప్రత్యక్షముగ నాతడు గాన్పించువరకు నమ్మకము గలుగలేదు. పశ్చాత్తాప వివర్ణవదనుడగు భర్తను ప్రథమమున గుర్తింపలేక పోయినను, కంఠస్వరముచే పోల్చుకొనినది. అట్టిస్థితి యందాతని జూడగనే హృదయము కరిగి స్రవించినది. ఆనందోద్రేకమున డగ్గుత్తిక వడినది. పాదములపై వ్రాలిన భర్తను లేవనెత్తి కంఠాలింగనము జేసికొనుటతోడనే పూర్వవృత్తాంతముల విస్మరించెను. భర్తృతిరస్కృతి వలన గలిగిన క్రోధము మాయ మయ్యెను. పశ్చాత్తాపతప్తుడై యెదుటనున్న దుష్యంతు నేమియనుటకుగాని నోరాడలేదు.

"దేవి! అవలంబ్యతాం పుత్రః! త్వాం పురస్కృత్య భగవన్తం ద్రష్టుమిచ్ఛామి"

అని యాతడనుటయే తడవుగ, తనజన్మ సార్థకమైనదని భావించి, కుమారు నెత్తికొని, భర్తృసహితయై మునిదంపతులకు నమస్కరించి వారి యాశీస్సులను పొందినది. ఇట్టి సంతోష సమయమున జనకుడగు కణ్వుడు లేకపోయెనే యని కంటతడి పెట్టుకొనెను. పంచమాంకమున నవమానమున కోర్వ్యక దండతాడిత భుజంగమువలె మండిపడిన శకుంతల భర్తనుజూడగనే యాతని యాజ్ఞానుసారిణి యైనది. స్త్రీయొక్క చిత్తవృత్తి యింత సులభముగ పరివర్తనమును బొందునని యీసన్నివేశము సూచించును.

కాళిదాసు నాటకము నందంతటను స్త్రీసహజములగు ప్రేమ, లజ్జ, భయము, శృంగారచేష్టలు, అవమానమున క్రోధము, హఠాన్మనః పరివర్తనము, పుట్టినింటి యందలి మమకారము మొదలగు చిత్తవృత్తులన్నియు శకుంతలా పాత్రమునందు చిత్రించి యాపాత్రమును సజీవము నొనర్చినాడు. నాటకమున సర్వత్ర శకుంతలా రూపమును సాక్షాత్కరింపజేసి యామె భాషణములు హృదయమున ప్రతిధ్వనింప జేసినాడు. ఇట్టియథార్థ చిత్రణమే కాళిదాసుని నాటకకళయందు సిద్ధహస్తుడని నిరూపించుచున్నది.

# విమల

పోట్లూరి వెంకటేశ్వరరావుగారు

భానుడు తన మాతృగర్భమునుండి మెల్లమెల్లన ఆకాశముపైకి వచ్చుచుండెను. సూర్యకిరణ ప్రసారముచే తామరకోరకములు తమ నిర్మలరేఖలను వికసింపజేసి చూపరులకు ఆనందమును గొలుపుచుండెను. జనులు వారివారి దినకృత్య నిర్వహణార్థము వడివడిబాటలబడి చనుచుండిరి. అట్టితఱి విమల పాశ్చాత్య వనితవలె నలంకరించుకొని స్నేహితురాండ్రను కలసికొనుటకు మహిళాసంఘమున కేగెను.

ఆమెఏగిన సుమారొక అరగంటకు మహిళాసంఘసభ ప్రారంభమాయెను. ఆ సభయందు విమలలేచి "సోదరీమణులారా! ఈ సభయందు స్త్రీస్వాతంత్ర్యమునుగూర్చి యొక్కింత ముచ్చటింపదలచితి. మనము మగవారికోర్కెలనుదీర్చి, శరీరదార్ఢ్యమునుగూడ గోల్పోయి సంతానాభివృద్ధి గావించుచున్నారము. భర్త కొట్టినను, తిట్టినను అనేక కష్టముల పాల్పరచినను విధిలేక అణగిపడియుండుచుంటిమి. "భార్యకు భర్తయే దైవము" అను సూక్తి పూర్వమునుండియు వచ్చుచున్నదిగాన మనము యిన్నియిక్కట్లు పడవలసిన వారమైతిమి. ఆ సూక్తులకర్తలు పురుషులేగాని స్త్రీలుగారు. దాన స్త్రీల కన్యాయమొనరింపబడినది. ఈ నాటినుండియు పురుషులవలె మనముగూడ స్వాతంత్ర్యముగలిగి యుండవలెను" అని యుపన్యసించగనే 'మహిళా సంఘమునకు జై' అను నినాదములతో సభముగిసెను. విమల మహిళాసంఘాధ్యక్షురాలు!

విమలభర్త రమేశ్ ఎంత సేపటికిని భార్య యింటికి రాకపోవుటచే ఎదురు చూచిచూచి విసుగుచెంది వంట ప్రయత్నములు చేసికొనుచుండెను. అప్పటికిని రాకుండుటచే వంటకూడ అష్టకష్టములపడి నిర్వర్తించెను. ఇంతలో విమల కూనరాగములు ఆలాపించుకొనుచువచ్చి తలుపుతట్టినది.

రమేశ్ తలుపు తెఱచెను. ఎన్నడునుకనివిని ఎఱుగని పరిమళవాయు వీచికలు విమల శరీరమునుండి వీయ ఆ సువాసనలాతనికి మత్తుగల్గించెను. కాని ఎటులనో ఆ మత్తును సడలించుకొని కోపముగ "విమలా! నీవు హద్దుమీరి వర్తించుచున్నావు. ఎంతకును నీవు రాకుండుటజేసి సర్వఅవస్థలపడి వంట చేసితిని. యిటమీదటయినను బాగుగ మెలగుము. ఈ మాటలన్నియు నిపుడేల? భోజనము వడ్డింపుము." అని రమేశ్ భార్యనుగట్టిగ మందలించెను. విమల మారుమాటాడక వంటగది చేరెను.

భోజనములైన తరువాత విమల విశ్రమించినది. సాయంతనమయ్యెను. శకుంత సంతానములు వృక్షాగ్రములనున్న గూండ్లను జేరికొనుచుండెను. పశ్చిమ దిక్కంతయు రక్తసిక్తంబయిన వస్త్రమారగట్టినట్లుండ, సూర్యుడస్తమింపదొడగెను.

విమల యథాప్రకారముగ సింగారించుకొని పాశ్చాత్యవనితలు పట్టుకొనుచేతిసంచి చేతిలోనుంచుకొని బయలుదేరెను. రమేశ్ అదిగాంచి "మరల ఎచటికేగుచుంటివి విమలా?" అని ప్రశ్నించినాడు. "షికారుకు వెళ్లుచుంటిని. ప్రొద్దునవలె వంటయొనర్చి అమ్మాయిని కనిపెట్టుకొని యింటనుండుడు" అని చెప్పి చరచరనడిచిపోయినది. రమేశ్ అతివిచారముతో మట్టిముద్దవలె అచటనే కూలబడెను.

ఇంతలో తలుపు ఎవరో గబగబతట్టిరి. పోయిన ప్రాణము తిరిగివచ్చినట్లయినదతనికి. విమల వచ్చెనను ఆశచే తలుపుతీసెను. అతనిఆశ నిరాశఅయినది. దేహమంతయు క్రొత్తకుండ చెమర్చినట్లు చెమటలతో నిండగా ఇద్దరు స్నేహితులనుగాంచి నిర్ఘాంతుడై నిలబడెను రమేశ్.

స్నేహితులిద్దరు నవ్వుచు "ఏమిరమేశ్! అటుల ప్రాణములేని జీవివలె నిలబడితివి;" అని ప్రశ్నించిరి. "ఏమిచెప్పను; నాభార్య యింటిపనులన్నియు నానెత్తిపైపడవేచి తాను సంఘసేవలని, సినీమాలని, స్త్రీ స్వాతంత్ర్యమని, మనకంటె ఎక్కువ పనులలో జోక్యము కలుగజేసికొనుచున్నది. అదేమి? అని ప్రశ్నించిన మారాడక తన పనులు తాను చేసికొనును. ఇట్టి పరిస్థితులలో ప్రాణములేనికట్టెను గాక మరేమి?" అనెను రమేశ్.

"సరియే రోలువచ్చి మద్దెలతో మొఱపెట్టుకొన్నటుల నీవు మాతో మొఱయిడుకొనుచుంటివి. మన ముగ్గురమును ఒకేయవస్థకు పాల్పడితిమి. దీనికితగిన యుపాయ మాలోచింపవలెను. లేనిచో మనకింతుక గంజినీరైనను పుట్టదు" అని స్నేహితులు చనిరి.

◆ ◆ ◆ ◆

మఱునాటిరాత్రి 7 గం॥లకు విమల దుస్తులనుమార్చుకొని సినిమాతారవలె సింగారించుకొని బయలు దేరినది. ఎచటికో? రమేశ్ అనుమానముతో ఆమెను రహస్యముగా వెంబడించెను.

విమల తనస్నేహితుడగు ప్రకాశ్ గృహమునకేగి అతనితో చేయీచేయికలపి నవ్వుతూ, నిర్మల హృదయముతో షికారు బయలు దేరినది. దానితో రమేశ్ అనుమానము బలపడినది. చేయునదిలేక యిల్లుచేరెను.

విమలా ప్రకాశ్‌లు ఆనందముగ బీచియొడ్డునకుజేరిరి. ప్రకాశ్ ఎంతో స్త్రీ స్వాతంత్ర్యప్రియుని వలె విమలతో సంభాషించుచు, మధ్యమధ్య ప్రేమపలుకులు పలుకుచుండెను. స్త్రీ స్వాతంత్ర్యాభిలాషా జలధిలో మునిగియున్న విమల అతనిప్రేమ ధోరణిని గ్రహింపలేకపోయినది.

సుగంధద్రవ్య వాసనలతోనిండి, పుష్పమువోలె కోమలమగు విమల శరీరమును, సౌందర్యమును వెన్నెలలోగాంచి తన ప్రేమోద్రేకమును ఆపలేక కౌగలించుకొనబోయెను ప్రకాశ్. విమల అది గ్రహించి అతనిని గట్టిగా నొకచెంపపెట్టుపెట్టి "నీచుడా, నీవిట్టి ద్రోహివని ఎన్నడును తలంచలేదు. మావలె నీవు గూడ స్వాతంత్ర్యకాంక్షివని తలంచితినిగాని, సర్వసౌఖ్యముల దులదూగు భార్యాభర్తలపాలిటి పెనుభూత మవని ఎన్నడును తలంచలేదు." అని రోషావేశంతో గృహముచేరినది.

రమేశ్ భార్యనుచూచి "ఎవరునీవు?" అని ప్రశ్నించెను. విమల "అదేమి అటుల అడుగు చుంటిరి. నేను మీ భార్యను కానా" అని హీనస్వరముతోననెను. "నా భార్య అయినచో నాతోడనే సౌఖ్యమనుభవించుచు సుఖముగా నిద్రించుచుండెడిది. నీవలె భర్తనువదలి పరపురుషునితో స్వేచ్ఛావిహారములుసల్పి అర్ధరాత్రివేళ యీ దురవస్థకు పాల్పడదు" అని రమేశ్ అనెను.

విమల తానొనర్చిన సమస్త విషయములను భర్తచూచి గ్రహించెనను భయముచే మారుపలుకక ఒక నిముషము అట్టే నిల్చెను. రమేశ్ కోపముతో నాగుమ్మము త్రొక్కవద్దని గద్దించెను. విమల భర్తపాదములపైబడి జరిగినసంగతివచించి "నేను స్వాతంత్ర్య మపేక్షించినదాననేగాని, అట్టి స్వతంత్రతను పురుష స్నేహ సందర్భమున నుపయోగింపరాదని ఎఱుంగనైతిని. ఇప్పటి పురుషులు (చాలమంది) సంస్కార రహితులు; వారిమనములు సంస్కారము పొందినవెనుకగాని వారితో నేస్తమొనర్పరాదు. స్త్రీ పురుష స్నేహమువలన స్త్రీపురుషుల కిర్వురకో, లేక యిర్వురియందొకరికో చెడుతలంపు లుత్పన్నముకాగలవు. ప్రస్తుతపు దినములలో స్త్రీ పురుషులు స్నేహమొనర్చిన, వారి స్నేహము మోహముగా మారవచ్చును" అని తెలిసికొనజాలనైతిని, నాతప్పుక్షమించి నన్ను మీదాననుగా జేర్చికొనుడు. ఇక నెన్నడు మీఆజ్ఞలేనిదే ఎచటికిని పోను" అని ప్రార్థించెను.

రమేశ్, "నీవు పాశ్చాత్య నాగరికతానుగుణముగ నలంకరించుకొనుట నాకిష్టములేదు" అనెను. విమల తా నానాటినుండి హిందూవనితవలె నలంకరించుకొనెదనని బాసయొనర్చెను.

ఆదినమునుండి ఆభార్యాభర్తలిద్వురూ చిలుక, గోరువంకలవలె సుఖసౌఖ్యములతో ఆనందదాయకముగ కాలము గడుపుచుండిరి. విమల మహిళాసంఘసేవ బాగుగ యొనర్చుచున్నది.

---

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యస్. కేసరి.

## ఆంధ్ర గాయకుల సేవ

నేను పుట్టిన వంగోలు తాలూకాలో సంగీత సాహిత్యములు బాగుగా వ్యాప్తికలిగి యుండెడివని పలుమారు చెప్పియుంటిని. అందుచేత అభ్యాసమువలనగాక నైజముగనే నాకు వానియందభిలాష. అందు ముఖ్యముగా సంగీతమన్న చెవికోసుకొందును. సంగీత పాటకులనుకూడ దరిచేర్చి నాచేతనైన సాయము చేయుచుందును. నాకీగుణము చిన్ననాటనే అబ్బినది.

## ఒక నియోగి పిల్లవాడు

నేను మద్రాసునకువచ్చిన ఆదిలో మధూకరమును యెత్తుకొని బ్రతుకుచుంటిని. అప్పుడునాకు ఒక నియోగిపిల్లవాడు స్నేహితుడాయెను. వీడు గోలకొండనివాసి. పేరు గోపాలుడు. పాలచంగావిధోవతినికట్టి సన్నగ తిరుమణితిరుచూర్ణమును ధరించుచుండెను. ఆ పిల్లవాని ముఖవర్చస్సు నన్ను ఆకర్షింపచేసెను. భాగవతాది గ్రంథములను చక్కగ రాగముతో ఆ పిల్లవాడు చదువుచుండెను అప్పుడప్పుడు కూనరాగములను కూడ తీయుచుండెను. తనకు సంగీతమును నేర్చుకొనవలయుననే కోరికగలదని పలుమారునాతో చెప్పుచుండెను. ఈ పిల్లవానికి యింకను నూనూగు మీసములుకూడ రాకపోయినను నియోగిలక్షణములు వీనిని బాధించుచుండెను. వీడు భోజనమునకు చాల కష్టపడుచుండెను. సత్రాన్నము సరిపడదు. వీని అవస్థనుచూచి నాతోకూడ మధూకరమునకు రమ్మని పిలిచితినిగాని ఈ నియోగి పిల్లవాడు సమ్మతించలేదు. నేను పస్తు అయినను పరుండెదనుగాని మధూకరమును మాత్రము యెత్తజాలనని గట్టిగ చెప్పెను. "భవతీ భిక్షాందేహి" అని అన్నము అడుగుటకు నాకు చాల చిన్నతనముగ నున్నదని నాతో దీనముగ పలికెను. అప్పుడు నాకు వానిమీద జాలికలిగి వానిని మన్నించి నేనే మరికొన్ని యిండ్లకుపోయి ఇరువురకు సరిపోవు అన్నమునుదెచ్చి యిరువురము భుజించుచుంటిమి. వీనికి సంగీతపుపిచ్చి బాగుగాపట్టి నన్ను వేధించుచుండెను. అప్పుడు నేను వీనిని వెంటబెట్టుకొని టంకశాలవీధిలో కాపురముండు పాలగాటు అనంతరామ భాగవతరువద్దకు పిలుచుకొనిపోయి వీనికోరికను భాగవతరుకు అరవములో చెప్పు

గలిగితిని. భాగవతరు సంతోషముతో శిష్యుని స్వీకరించిరి. మరుసటిదినము మొదలు శిష్యుడు భాగవతరువద్దకు శిక్షకు పోవుటకు ప్రారంభించెను. గాని అన్నమునకు మాత్రము నా వద్దకే వచ్చుచుండెను. శిష్యుడు హైదరాబాదు ఆంధ్రుడు. గురువులవారు పాలగాటు అరవలు. ఇందువలన గురుశిష్యులకు నోటిమాటలు లేకుండగనే శుశ్రూష ప్రారంభమాయెను. శిష్యుడు అప్పుడప్పుడు పోతనభాగవతమును నాటకశైలిలో చదివి గురువులవారికి వినిపించుచుండెనుగాని వారికి అది తలనొప్పిగనుండుట శిష్యుడు గ్రహించి గ్రంధమును కట్టిపెట్టెను. పిమ్మట కాళ్లు పిసికించుకొనుటతోను, గుడ్డలు ఉతికించుకొనుటతోను, పొగాకును సన్నగ కత్తిరించి వక్కపొడిలో కలిపి అందించగా భక్షించుటతోను, అతని సంగీత విద్యాభ్యాసము ప్రారంభమైనది.

అనంతరామ భాగవతర్ భారీమనిషి. సుమారు ఆరుఅడుగుల పొడవుండును. ఆజానుబాహువు. విశాలనేత్రములు బుఱ్ఱమీసములు గలవారు. మంచిమేనిఛాయ; కండపుష్టిగలవారు. వీరు మొదట సంగీత కచ్చేరిలను చేయుచు మంచిపేరు గడించిరి. క్రమముగ పాటకచ్చేరులనుమాని హరికథా కాలక్షేపములకుదిగిరి. వీరిహరికథలు జనులకు ఆకర్షణీయముగనుండెను. హరికథలకు పోవునప్పుడెల్లను మనశిష్యుడు కాఫీకూజ తమలపాకులపెట్టెను కూడ తీసుకొనిపోవుచుండెను. హరికథా కాలక్షేపము రెండుమూడు గంటలకాలము నిలుచుకొని చేయుటవలన భాగవతరు కాళ్లనొప్పులతో యిల్లుచేరి వెల్లకిలపడుకొని శిష్యుని చేరదీసి కాళ్లమీద గుద్దులదరువు వేయుమనేవారు. పిల్లవాడు పాటనేర్చుకొనుటకుముందే దరువు నేర్చుకొనెను. ఈశుశ్రూష సుమారు ఆరుమాసములవరకు జరిగినది. శిష్యునకు విసుకుపుట్టి ఈ బండచాకిరిని చేయలేక నాతోకూడ చెప్పకుండ పరారిచిత్తగించెను. ఇది గానవిద్యాభిమానమున నా మొదటి అనుభవము.

## శర్మసోదరులు

నేను మద్రాసులో స్థిరవాసరమేర్పరచుకొని ఎగ్మూరులో స్వగృహమును నిర్మించుకొనిన పిమ్మట నా స్నేహితులు గుంటూరు పబ్లికు ప్రాసిక్యూటరు రావుబహదూర్ కామరాజు మన్నారు క్రిష్ణరావుగారి వద్దనుండి ఒక సిఫారసుజాబును తీసుకొని ఇద్దరు బాలురు నా వద్దకువచ్చిరి. వీరితండ్రి కొండలరావు గారు వీరికూడయుండిరి. వీరు నాకుదెచ్చిన జాబులో - ఈ పిల్లవాండ్రు విజయనగర ప్రాంతమునకుచేరినవారనిన్ని, కొంతకాలము ద్వారం వెంకటస్వామిగారివద్ద గానవిద్యాభ్యాసమును చేసినవారనిన్ని, మిక్కిలిపేదవారనిన్ని మద్రాసులో నా సహాయమును కోరివచ్చుచున్నారనిన్ని వ్రాసి

యుండెను. మద్రాసుకు వచ్చుటకు రైలుచార్జిలేక మా వద్దవున్న హార్మోనియమును అమ్ముకొని ఇక్కడికిరాగలిగితిమని పిల్లవాండ్లతండ్రి కొండలరావుగారు చెప్పిరి.

వీరి విద్యాభ్యాసమునకై తల్లిలేని పిల్లలను వెంటబెట్టుకొని తండ్రి కష్టపడుట చూచి నాకు వార్లమీద పశ్చాత్తాపము కలిగినది. వారు నా యింటికి వచ్చినప్పుడు సుమారు పగలు 10 గంటల కాలము. వార్లను వెంటనే స్నానమును చేయుడని నాతో కూడ భోజనమును చేయమంటిని. భోజనానంతరము పిల్లకాయలనుపిలిచి పాటను వినగోరితిని. చిన్నపిల్లవాడు (కామేశ్వరశర్మ) వీణ, గాత్రము సాధకమును చేసినవాడు. పెద్దవాడు గోపాలరాయశర్మకు ఫిడియలు సాధకము. వీరిరువురి కచ్చేరియు అరగంట కాలము వింటిని. చిన్నవాని గాత్రము వీణానాదము యేకమైనప్పుడు గాంధర్వగాన మనిన నిదియే యేమోనని నాకు తోచినది. చిన్నవాని ప్రాయమప్పుడు సుమారు 12 సం॥ ఉండవచ్చును. బాలప్రాయముగనుక వాని కంఠము కిన్నరస్వరమునుబోలి యుండెను. రెండవవాని ఫిడియలు వయసుకుమించిన సాధకముగ కనుబడెను. ఈ బాలురపాటవినిన పిమ్మట వీర్లకు నా చేతనైన సహాయమును చేయుటకు నిశ్చ యించుకొని నా యింటనే ఉంచుకొంటిని.

మద్రాసులోయున్న గానకళాకోవిదులను కొందరిని వీరికి పరిచయపరచి వారివద్ద సంగీతమును అభ్యసింప చేసితిని. వీరు అరవగాయకులవద్ద కొంతకాలము విద్యనభ్య సించి బుద్ధిమంతులైరి. మద్రాసులోయున్న గానసమాజముల ద్వారిని ఆశ్రయించి వారి సభలలో, ఈ పిల్లకాయలకు అవకాశమివ్వవలయునని పలుమారు వార్లను వేడు కొంటినిగాని ఫలించలేదు. ఈ సమాజములన్నియు అరవవారి చేతులలో యున్నందున వీరికి అవకాశము కలుగలేదు. అప్పుడు నేను యితరులను ఆశ్రయించి ప్రయోజనము లేదని తెలుసుకొని పిల్లకాయల గానమాధుర్యమునుగురించి వార్తాపత్రికలలోను కరపత్ర ములద్వారాను వెల్లడిచేసితిని. పిల్లవాండ్లకు శర్మసోదరులని (Sarma Bros) పేరుపెట్టి గోక్లేహాలునందును, విక్టోరియా పబ్లీకుహాలునందును గొప్పవారియాజమాన్యముతో పాటకచ్చేరీలు యేర్పాటుచేసితిని. ఆ సమయమున మద్రాసు ప్రముఖులలో కొందరు పిల్లవాండ్ల గానమును గురించి ఉపన్యసించిరి. మరునాడు వీరికచ్చేరీలను గురించిన ఉప న్యాసములు వార్తాపత్రికలవార్లు ప్రచురించిరి. అప్పటినుండి మద్రాసులో వీరిపాటకు పేరువచ్చి సంగీతసమాజములవారు వీర్లను ఆదరించుచుండిరి.

మద్రాసులో కొన్ని సంవత్సరములక్రిందట ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు (All India Oriental conference) సెనెట్ హాలులో జరిగెను. ఆ సభకు రాజ

థానిలోయుండు గొప్పగాయక శిఖామణులను ఆహ్వానించి పాడించి మంచిపాటకులకు బంగారుపతకములను బహూకరించిరి. ఈ సభలో శర్మసోదరులుపాల్గొని జడ్జీలను మెప్పించి బంగారు పతకములనుబడసిరి. ఈ సభముగిసిన మరునాడు కాన్ఫరన్సుకువచ్చిన హేమాహేమీల నందరిని నా యింటికి విందుకుబిలచి శర్మసోదరుల పాటకచ్చేరిని యేర్పాటుచేసితిని. ఈ కచ్చేరికి అరియకుడి రామానుజయ్యంగారు, వేణుగాన సంజీవ రావుగారు, నాగస్వరం మధురపొన్నుసామిపిళ్ల, మృదంగం అళగనంబి, దక్షిణామూర్తి సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు, మొదలగు సుమారు రెండువందలమంది విందుకువచ్చి పిల్లవాండ్రగానమునువిని సంతోషించిరి. ఈ సభకువచ్చిన వారందరు ఆనాడు గ్రూపు ఫోటోను తీసుకొనిరి.

పిమ్మట కొంతకాలమునకు రామేశ్వరము దేవాలయములో మహాకుంభాభి షేకము జరిగెను. ఈ కుంభాభిషేకమునకు గొప్పసంగీత విద్వాంసులను రావించి సభ లనుగావించి మొదటిక్లాసు విద్వాంసులకు రు 500 లు బహుమతి నిచ్చిరి. ఈ సభలో కూడ శర్మసోదరులు రు 500 లు తాంబూలమునుబడసిరి. ఈ కుంభాభిషేక మహోత్స వమునకు నాటుకోటిశెట్లు కొన్ని లక్షలు ఖర్చుపెట్టి అతివైభవముగ పది దినములు అభిషేకాది కార్యములను జరిపిరి. ప్రతిదినము సుమారు పదివేలమంది పలువిధములైన పిండివంటలతో భోజనముచేసిరి. మేము రామేశ్వరమునుండి శేతువుకుపోయి స్నానము చేసి మధురకువచ్చితిమి. మధురలో రెండు సంగీతకచ్చేరీలుచేసి వెయ్యిరూపాయిల ముడుపుతో మద్రాసుచేరితిమి.

పిమ్మట మైసూరు ఆస్థాన సంగీత విద్వాంసులగు బిడారం క్రిష్ణప్పగారిని శర్మ సోదరులకు పరిచయపరచితిని. క్రిష్ణప్పగారు పిల్లకాయలగానమునువిని చాలసంతోషించి వీర్లను మైసూరు దర్బారులోకి ప్రవేశమును కలుగచేసిరి. శర్మసోదరుల గానమును మహారాజులవారు (గతించినవారు) వినిచాల సంతృప్తులయి గాయకులకు గొప్ప బహు మానముల నొసంగిరి. ఒకటిరెండు కచ్చేరులు దర్బారునందు జరిగినపిమ్మట ఈ పిల్ల కాయలను క్రిష్ణప్పగారికి వప్పగించి వీర్లను మీరు చక్కగ తరిఫీదుచేయవలయునని ఆజ్ఞాపించిరి. వీరు దర్బారు అతిథులుగ యుండుటకు తగుమైన యేర్పాట్లును చేయించిరి.

ఈ సోదరులు కొంతకాలము క్రిష్ణప్పగారివద్ద విద్యనభ్యసించి మద్రాసుకుచేరిరి. ఇప్పుడు వీరివద్ద కొంతముల్లెచేరినది. మాయిల్లువిడిచి వేరేబస నేర్పరుచుకొనిరి. స్వతం త్రులయిరి. నేను మొదట అనుకున్నంత వృద్ధికి మద్రాసులో రాజాలకపోయిరి. పిల్ల

కాయలిద్దరు వివాహములను చేసుకొని బిడ్డలతో సుఖముగ మద్రాసులో స్థిరవాసరము నేర్పరచుకొనియున్నారు. వీరు క్రమముగ పాటకచ్చేరీలకు స్వస్తిచెప్పి సినీమాలలో వెనుకపాటకులయిరి. నేను అప్పుడప్పుడు వీర్లను చూచుచుందును. చిన్ననాటి విషయము లను జ్ఞాపకమునకు తెచ్చుకొని సంతోషించుచుదుంను.

## హరినాగభూషణముగారు

బ్రహ్మశ్రీ గాయకశిఖామణి హరినాగభూషణముగారు ఆంధ్రదేశమునకు చిరపరిచితులు. వీరు ఫ్లీడరువృత్తిలోనుండి ఫిడియలును అభ్యసించి ప్రసిద్ధపురుషులయిరి. వీరు అందరికి సులభముగ అందరివలె అందుబాటులో లేకపోయినను దొరికినప్పుడు సభ్యులను ఆనందింపచేయు పండితులు బ్రహ్మవర్చస్సుగల వైదికశిఖామణి. రామభక్తులు. సంగీతముతోకూడ సాహిత్యమును అభ్యసించిన పుణ్యపురుషులు. ఈ కాలమున ఆంధ్రదేశమునకు వన్నెదెచ్చిన వాగ్గేయకారులు.

వీరు మద్రాసున నాయింటికివచ్చి నన్నాశ్రయించిరి. మద్రాసులో వీరిని గొప్పగ సన్మానించవలయునని ఒక సన్మానసంఘముయేర్పాటుచేయుటకు ప్రయత్నించితినిగాని అది జరుగలేదు. కడపట నాయింటిలోనే సభచేయించి రజితపాత్రము రు 116 లు బహుమతినిచ్చి నమస్కరించితిని.

## వారణాశి సోదరులు

వారణాశి సుబ్బయ్య, ఘంటయ్య అని వీరుసోదరులు. ఒకరు గాత్రమున ఒకరు మృదంగమున నిధులు. వీరు మద్రాసుకువచ్చి నన్నాశ్రయించినప్పుడు వీర్లసంగీతసభను గోక్లేహాలులో యేర్పాటుచేసి జోడుతోడాలను ఇరువురకు తొడిగితిని. వీరిది బందరు కాపురస్థలము. మరల వీరినినేను చూచుటకు తటస్థించలేదు.

## యజ్ఞనారాయణశాస్త్రి

యజ్ఞనారాయణశాస్త్రిగారు అని యొకరు 1942 లో కాబోలు నావద్దకువచ్చిరి. వారు ఫిడేలును ద్వారం వెంకటస్వామిగారివద్ద నేర్చితిమనిరి. వీరిని సంగీత శాస్త్రమున పేర్గాంచిన శ్రీ వెంకట్రామయ్యర్ గారివద్దకు తీసుకొనివెళ్లి వినిపించితిని. వారు ఆయనకు సంస్కారమును సాధనయు కలదనిమెచ్చిరి. ఆపిదప నాయింటనే యొకకచ్చేరీ గావించింది అందు ఆయనను బంగారుపతకమును గొలుసుతోచేర్చి కంఠమున అలంకరింపజేసి సత్కరించితిని.

## మద్రాసు గానసభలు

నేను మద్రాసుకువచ్చినపిమ్మట అరవల సాంగత్యమువలన నాకున్న క్రమముగ గానకళాభిమానము ఇనుమడించినది. మద్రాసులోజరుగు సంగీతకచ్చేరీలకు నేను తప్పక హాజరగుచుండెడివాడను. ఆ కాలమున మద్రాసులో నేటివలె సంగీతసమాజములుండినట్లు నాకు జ్ఞాపకములేదు. ఎవరియిండ్లలోనైననుఅగు వివాహకార్యముల సందర్భములలో జరుగు పాటకచ్చేరీలకు పోవుచుంటిని. అప్పుడు పురుషుల కచ్చేరీలకంటే స్త్రీలకచ్చేరులే విశేషముగ జరుగుచుండెను. బెంగుళూరు నాగరత్నం, కోయంబత్తూరుతాయి, ధనకోటి, గోదావరి, సేలంచెల్లెంద్రు, రాజాయి మొదలగువారి కచ్చేరులు విశేషముగ జరుగుచుండెరు. వీణె ధనము గొప్పవిద్వాంసురాలైనను వివాహకార్యములలో వీణె కచ్చేరిని పెట్టించువారు చాలకొద్ది. అయితే ఈమె ప్రతిశుక్రవారమునాడు తన యింటిలో వీణె కచ్చేరిని జరుపుచుండెడిది. అప్పుడు అభిమానులు ఆమె యింటికిపోయి వీణెపాటను వినేవారు.

వేణుగానగాయకులలో ప్రధమమున మద్రాసుకువచ్చి అసమానపాండిత్యమును చూపిన మహానుభావుడు శరభశాస్త్రిగారు. వీరుపుట్టినదిమొదలు ఈ పాడులోకమును చూడక జ్ఞానేంద్రియములతోనే వేణుగానమభ్యసించి కీర్తినిబడసిన పుణ్యపురుషుడు. వీరితర్వాత వేణుగానములో ప్రసిద్ధిచెందినవారు నాగరాజరావుగారు, పల్లడం సంజీవరావుగారు. సంజీవరావుగారు వృద్ధులైనను ఇప్పుడు యెప్పుడైనను పాడుచుందురు.

ఆ కాలమున శరభశాస్త్రిగారి వేణుగానము, గోవిందస్వామి ఫిడియలు, అళగనంబి మృదంగము గొప్పపాట కచ్చేరిగనుండెను. ఈముగ్గురికచ్చేరి ఒకనాడు జార్జిటవున్‌లో యొకశెట్టిగారింట జరుగుతుందని దెలిసి నేనును నాతోకూడ నెల్లూరి కాపురస్థుడు విస్సారామారావుగారును వెళ్లితిమి. అప్పుడు విస్సారామారావుగారు మద్రాసులో లాకాలేజిలో చదువుచుండిరి. వీరుగానప్రియులు ఈ కచ్చేరికి రావలసిన విద్వాంసులలో శరభశాస్త్రివారును గోవిందసామి ఇరువురు వచ్చిరిగాని మృదంగమునువాయించు అళగనంబి యింకను రాకయుండెను. వచ్చినపాటకులు కొంతవరకు వేచియుండి మృదంగమునకు మరియొకని యేర్పాటుచేసి సభను సాగించిరిగాని శరభశాస్త్రిగారికి మృదంగమంతగ సహించలేదు. అళగనంబిగారువచ్చిరైలు ఆలస్యముగ వచ్చినందున వారు అరగంట ఆలస్యముగ సభకువచ్చి శాస్త్రిగారి ప్రక్కన మెల్లగ కూర్చుండి తిన్నగ మద్దెలమీద దెబ్బవేసిరి. ఆ సుశబ్దమును శాస్త్రిగారువిని ఆనందముతో "అణ్ణా

వందియా'' (అన్నావచ్చావా?) అని అళగనంబిని చేతితోతడిమి సంతోషించెను అప్పుడు సభ్యులందరు గొల్లున నవ్విరి. ఈ పుట్టంధుడు అళగనంబిని చూడకనే సుశబ్దమును వినినవెంటనే వారిని గుర్తించగలిగెను. ఈ విషయమును నేను యిప్పటికిని యెవరితోనైనను చెప్పుచుందును.

ఆ కాలమున మద్రాసులోజరుగు వివాహకార్యముల సందర్భములలోజరుగు సంగీత కచ్చేరీలకు స్త్రీలు వచ్చెడివారుగాని బహిరంగముగ జరుగు గానసభలకు స్త్రీలు అంతగ వచ్చెడివారుకారు. కొద్దిమంది సంగీతజ్ఞానముగలవారువచ్చినను చాటున కూర్చుండి పాటనువిని పోవుచుండిరి. ఇప్పటివలె అప్పుడు స్త్రీలలో గానకళాభ్యాసము వ్యాప్తిచెందియుండలేదు. అ కాలమున దాశీలుతప్ప తక్కినవారు గానమభ్యసించుట మర్యాదగనుండెడిదికాదు.

ముందు మద్రాసులో గొప్పవారి ఇండ్లలో కల్యాణాదిశుభకార్యములు జరిగినప్పుడు వీధిపందిళ్లువేయించి ఆ డాబాను చక్కగ శృంగారించి దానిలో గానసభలను ఆటకచ్చేరీలను జరిపించుచుండిరి. ఆ కాలమున ఇట్టిపందిళ్లు వేయించి వివాహమునుచేయుట గొప్ప గౌరవము. డాబాఅడుగు భాగమంతయు చక్కలనుకూర్చి పైనరత్నకంబళ్లనుపరిచి సోఫాలు కుర్చీలు వేసేవారు. పందిలంతయు మైనపువత్తుల గులోబులను వెలిగించేవారు. రసగుండ్లను వ్రేలకట్టేవారు.

జార్జిటవున్ గోవిందప్పనాయుని వీధిలోయుండు గొప్ప శెట్టిగారింటిలో వివాహము జరిగెను. ఆ వివాహమునకు ఆటకచ్చేరిని యేర్పాటుచేసిరి. అప్పుడు మద్రాసులో షణ్ముఖవడివేలను నాట్యకోవిదురాలుండెను. ఈమె నాట్యమును అప్పుడు జనులు హెచ్చుగ మెచ్చుకొనుచుండిరి. ఈమెచాల స్థూలకాయమునుగలిగిన నల్లటినటకురాలు. పొట్టిగనుండును. ఇట్లుండినను ఈమెనాట్యము మెచ్చుకొనదగినది. జనులు గుంపులుగ వచ్చుచుందురు. నేనుకూడ ఆనాడు అక్కడ ముందున కూర్చుండగలిగితిని.

సాధారణముగ పెండ్లిండ్లలో ఇంటిపెండ్లిపెద్ద ముందు కూర్చుండును. ఈ యింటి శెట్టి వీరవైష్ణవ సాంప్రదాయకుడు. దట్టముగ నామమును ధరించి ముందు కూర్చుండెను.

ఈ నటకురాలు "శివదీక్షాపరురాలను రా," అనుపాటనుపాడుచు శెట్టిగారి ముందున కూర్చుని ఆనాడు బిల్వదళముల అర్చనచేయు అభినయముతో లింగార్చన చేసినది ఇప్పటికిని నాకు మరుపురాని దృశ్యము. ప్రేక్షకులలో కొందరికి పొట్టలుబ్బినవి.

కొందరి తలపాగాలు జారి క్రిందపడినవి. అటుపిమ్మట ఈమె లేచి తాండవనృత్యముసల్పినప్పుడు సభ్యుల ఆనందమునకు మేరలేకుండెను. ఆ స్థూలకాయముతో ఆమెఅంత చులకనగ చువ్వవలె మెలగుచు చేసిన నృత్యమును నాకింకను మరుపురాలేదు. బల్లకూర్పుతో అమర్చిన హాలునందు ఈమె పాదతాళము ప్రతిధ్వని నిచ్చుచుండెను. ఆమె అప్పటికే నడివయసురాలు - వడ్డ్యాణమును ధరించుటకు వీలులేకపోయినను నాడాతో బిగించిన నడుమును విల్లనంబువలె వంచగలిగెను. ఈమెపాడిన "శివదీక్షాపరురాలను రా" అను కీర్తనకు గ్రామఫోనుప్లేటున్నవి.

ముందు మద్రాసులో సుప్రసిద్ధలాయరుగనుండిన పనప్పాకం ఆనందాచార్యులుగారు గొప్పగానకళాపోషకులుగ నుండిరి. వీరు ఆంధ్రులు. ఆంధ్రభాషాభిమానులు. వీరప్పుడు తెలుగుపత్రికనుకూడ నడుపుచుండిరి. కాంగ్రెసు ప్రెసిడెంటు పీఠమును అలంకరించిన దేశభక్తులు. వీరు సంగీతజ్ఞానము గలవారగుటచే వీరింట అప్పుడప్పుడు గానసభలు జరుగుచుండెను. నేను పోవుచుంటిని. వారిపేరుగలబోర్డు యిప్పటికిని పూనమల్లి హైరోడ్డులో వారింటిగేటున చూడనగును.

మద్రాసు గోవిందప్పనాయుని వీధిలో తచ్చూరు శింగరాచార్యులుగారుండిరి. వీరు సంగీత విద్వాంసులు. ఫిడియలును చక్కగ సాధకమును చేసినవారు. వీరింటిలోనే శ్రీరామమందిరమును యేర్పాటుచేసి అప్పుడప్పుడు గానసభలను చేయుచుండిరి. ఆ కాలమున విద్యార్థులకు ఉచితముగ వీరు విద్యను నేర్పుచుండిరి. వీరు ఆంధ్రులయినను మద్రాసులోనే స్థిరవాసము నేర్పరచుకొనిరి. ధర్మబుద్ధి గలిగినవారు. ధర్మవైద్యమునుకూడ చేయుచుండిరి. సంగీతకళానిధి యను గ్రంథము వీరువ్రాసినదే. తెలుగుదేశమున 'సరిగమ పదనిసలు' నేర్చినవారికెల్ల ఇదియే పాఠ్యగ్రంథము. అనేకసుగుణములతోపాటు సంగీతకళావేత్తయునైన శ్రీ శ్రీ శ్రీ విజయనగరం ఆనందగజపతి మహారాజులుంగారికి వీరు అత్యంతమిత్రులు.



స్థాపితము. 1941    జై స్వతంత్ర భారతికి జై    తంతి. "ఉమా"

# ఉమా గోల్డు కవరింగు వర్క్సు

ఉమా మహల్  ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు. మచిలీపట్నం

భారతదేశ తృతీయ స్వాతంత్ర్య వార్షికోత్సవ సందర్భమున మా ఖాతాదారులకు, శ్రేయోభిలాషులకు మా హృదయపూర్వక అభినందనములు.

1941 సంవత్సరము మొదలు నేటివరకు మాచే తయారుకాబడుచున్న 'ఉమా బంగారు కవరింగు ఆభరణములు" వన్నె గ్యారంటీగా యుండి మిమ్ములను ఆనందపరచుచున్నవి. ఇకముందుకూడ ఇదేమాదిరిగా మిమ్ములను ఆనంద పరచగలవు

10 Years Guaranteed

USE UMA

239 Pair 1-8-0

238 Pair 1-8-0

Each 0-10-0

251 252

GOLD COVERING ARTICLES

UMA 620 KRISHNA

UMA 695

SRI RAMA

255 Pair 2-0-0

UMA

Pair Rs 2-0-0

H 192

UMA BANGLES 218 216 214 209 208 206 205 204 201 248 800

Bangles 2 inches Rs 7-0-0

SWASTIC Bangles 2 Inches Pair Rs 8-0-0

282

Radio Bangles Pair 2 Rs 12-0-0

285

Bending Bangales 2 inches Size PAIR Rs. 7-0-0

UMA 292. RS 6-0-0

18 Inches BABY CHAIN

UMA 696 UMA 697 UMA 698

PHOTO RINGS EACH RS. 3-4-0

261-1. CHAIN

18" INCHES LONG Rs 6-0-0

WITH LOCKET Rs. 6-0-0

STONE RING

WITH LOCKET

277/3 Rs 3-4-0

Button Chain Without Locket Rs. 2-0-0

UMA

Pair Rs 5-0-0

H.173

Pair Rs 2-0-0

UMA 135

UMA 160 Pair 4-0-0

UMA. 293 Each Rs. 2

MARUTHI LOCKET Each Rs. 1-0-0

UMA 607 Rs. 2-12-0

UMA 291 Each Rs. 5-0-0

800 ఆభరణముల క్యాటలాగు కోరినవారికి ఉచితముగా పంపబడును. వస్తువుల వీ. పి. పార్శిలు చార్జి రూ. 0-15-0 ప్రత్యేకం.




(1948 నవంబరు సంచికలో వివరింపబడిన;శిశు వ్యాధులకు సులభచికిత్సలు.)

20. కామెర్లు:- అనగా రక్తహీనము; ఎర్రని కణువులులేని రక్తము, పాలిపోవుట, చిన్నపిల్లల కండ్లు పశిరికలగుట, అని పలువిధముల నీ వ్యాధిని పిలుతురు. అజీర్ణమువల్లను పోషణలేకను, పోతపాలవల్లను ఈ వ్యాధిసంభవించును. ఈ వ్యాధిని తల్లియే పిల్లలకండ్లు, బుగ్గలచూచిన గ్రహించవగును. పిల్లలను దాసీల చేతికిచ్చి వారలపాలు చేయక స్వయముగా యెత్తి ముద్దాడు తల్లులు పిల్లలతూకము తగ్గినదనియు, నీరసించెననియు కూడ త్వరలో తెలుసుకొనగలరు.

ఇట్టి వ్యాధులకు సులభ చికిత్సలు కలవు గాని తల్లిపాలు యిచ్చుటలోను పోయుటలోను క్రమము తప్పని మాదిరిగ యిచ్చుచుండవలయును.

ఇట్టి లక్షణములు పాలమరచి అన్నము తినుటకుప్రారంభమగునపుడే మొదలిడును! ఈ సందిగ్ధావస్థలో తూకమైన ఆహారము కుదురదు

| | |
|---|---|
| వాము | 1 తు |
| కరక్కాయబెరడు | 1 తు |
| చెంగల్వకోష్టు | 1 తు |
| మిరియములు | 1 తు |

లను చేర్చి మెత్తగా చూర్ణముచేసి, వస్త్రకాళిత మొనర్చి తడవకు 6 గ్రెనులు చొప్పున రోజుకు రెండు పర్యాయములు పాలలోగాని గోరువెచ్చని నీటిలోగాని కలిపి యివ్వవలయును. 3 సంవత్సరములవరకు పనికివచ్చును.

మరియొకటి:- కాసీససిందూరమును తయారుచేసుకొనుటకు తెలియనివారు వుండరు. వేపచెక్క కషాయముతో 6 గ్రెయినుల సిందూరమును 1/4 ఔన్సు కషాయములో వేసి రోజుకు రెండుపర్యాయములు యివ్వవచ్చును.

మరియొకటి:- కాసీససిందూరము 20 గ్రెయినులు.
మిరియాల చూర్ణము 20 ,,
తేనె—తగినట్లు

మంచికల్వములోనూరి పెసరగింజలంత మాత్రలు చేయవలయును. రోజుకు రెండుచొప్పున వాడిన చాలును. వేడి చేయదు. సాఫిగా విరేచనమగును.

21. శుద్ధపడుట:- వయస్సుకు, తగిన తూకము అందము, లేక బిడ్డలు తగ్గినట్లు వ్యాధికానుపించిన తల్లులు జాగ్రత్తగ చూచి వ్యాధి రట్టు అన్న సామెతను పాటించి పలు వైద్యములు మొదలుపెట్టెదరు. మూత్రము పరీక్షించిన అన్నియు శోధము గును ఆడపిల్లలకైనసూ నొక చికిత్సకలదు.

నేలగుమ్మడి దుంపలు సామాన్యముగా బజారు అంగళ్ళలో దొరుకును. తెచ్చి మెత్తగా చూర్ణముగొట్టి వస్త్రకాళితము చేసుకొనవలయును. సుగంధపాల (పాలసుగంధి) యను నొక దివ్య ఓషధికలదు. ఇదియుకూడ అందరకు తెలిసినదే. దీనిపొట్టును తీసి యెండబెట్టి చూర్ణముచేయుము. అంత యీ రెంటిని కల్పి పూటకు రెండు అణాలయెత్తు చూర్ణమును రోజుకు రెండుపర్యాయములు 1ఔన్సు గుమ్మపాలలో (అప్పుడు పిండినపాలు) వేసి బిడ్డలకు త్రాగించిన యెట్టి మేహసంబంధమగు న జబ్బులు రానేరవు. విదేశీయ టానిక్ ఔషధముల కంటె మన తత్వములకు అనుకూలించును.

22. విసర్పము:- దీనికే క్లుప్తముగ "సర్పి"యనికూడా వాడెదరు. నొప్పి, మంట పోటు మూడును వుండును. చిన్నపిల్లలు భరించరానిది. దీనినే కొందరు, తిమ్మిలేక అనాస యని స్థలభేదములచే చెప్పుదురు. దీనికితోడు దుమ్ము, ధూళికూడ నైజముగవారిని అంటుచుండును. గుదస్థానమున సంభవించు దానికి తిమ్మియనియు అనాసయనియు చెప్పుదురు.

| | |
|---|---|
| మిరియములు | 1 తు |
| వచ్చిపోకలు | 1 తు |
| కరకాయ బెరళ్ళు | 1 తు |
| తుమ్మచెక్క చూర్ణము | 1 తు |

పటిక చూర్ణము 1 తు

కర్పూరము— 1/4 తు

మొదటి అయిదు చూర్ణించి వస్త్రగాళితము చేయువలయును. పిమ్మట కర్పూరమును చేర్చి రోజుకు రెండుమూడు పర్యాయములు కొబ్బరినూనెలోగాని మంచివెన్నెలోగాని కల్పి రాయవలయును. మరియు ఆ చూర్ణమును నీళ్లలోవేసి కడుగుట కూడ మంచిది. త్వరలో గుణము కానుపించవలయు నంటేకొద్దిగ నిమ్మకాయ రసమునుకూడా చేర్చుట మంచిది.

---

# ఇంటిపనులలో మెళుకువలు

## బిడ్డలు, ఆముదం

సాధారణంగా చిన్నపిల్లలకు ఆముదం కాళ్లమీద పడుకోబెట్టికొని నోట్లో పోస్తారు. వాళ్ల అల్లరి తప్పనిసరే. అయితే ఐదేళ్లు మొదలు పదేళ్లలోపల పిల్లలకు ఆముదం పట్టేటప్పుడు వాడవలసిన విధులు మాత్రం నా అనుభవములోనివి వ్రాస్తా.

కొంతమంది 'రేపు నీకు ఆముదం, పడతా.' 'ఏమండోయి కూరలు మంచివేమి తేకండి.' కొంపదీసి అబ్బాయి కక్కుర్తిపడితే చస్తాము. రేపు మీ మాష్టర్ని సెలవడుగు ఆముదం తాగుతానని, ఇట్లాంటి మాటలు ఆదినుండే అనడంవల్ల ఆముదమనేది ఏదో ఒక భయంకరరూపమని ఆ బిడ్డలు పలవలు చిలవలు అల్లుకుంటారు వారి హృదయాల్లో. సరే త్రాగేరోజున 'రా' అని నాన్నమ్మ కాళ్లమీద పడుకోబెట్టుకొని ఆముదంగిన్నె పట్టుకొని నోటిలో పోస్తుంటే నాన్న కాళ్లు, అమ్మ చేతులు, పట్టుకొని మధ్యమధ్య ముక్కుమూయడం, పెద్ద అరుపులు. నాన్న 'ఒరేయ్ వెధవ త్రాగు, తాగుతావా?' తన్నమంటావా? అమ్మ ఉత్తినే వచ్చిందికాదురా, బోలెడు డబ్బోసి కొన్నాను త్రాగు. అమ్మో పొరపోతాది. ఏడవకురా వెధవా. 'నాయనమ్మ' మింగు అదిగో కక్కేస్తున్నావు. ఊ! ఊ! మింగు గిల్లేస్తా! చంపేస్తా! ఓరి నీ దుంపదెగా కక్కేశావురా! ఇంకా కొంచెం పొయ్యవే! అంతా కక్కేశాడు. కుర్రాడు 'చచ్చిపోతాను బాబోయ్, నాకొద్దుబాబోయ్,' అని పెంకులు ఎగిరిపోయేలాగు అరుస్తాడు. ఈ భీకరశబ్దాలకు చంటిపాపలు భయపడి ఏడుస్తారు. ఇరుగుపొరుగువారు వస్తారు. అన్నిటికన్నా చిత్రమైనది నాన్నలుంగీకి ఆముదం, అమ్మ కోకకు ఆముదం, నాన్నమ్మ ఒడిఅంతా ఆముదం. మూతితుడిచిన గుడ్డలు ఆముదంముద్ద. మరి ఆ జాగాఅంత ఆముదం. మరి ఇన్నెందుకు ఒక్కమాటలో చెప్పాలంటే ఆ రోజంతా ఆ యింట్లో ఆముదం ఘుమాయింపే.

అట్లాగాకుండా రేపుఆముదము పడుతామనగా తల్లి ఆ రాత్రి వీలుకలిగించుకొని ఎంతమందికి పడతామో వారందరితో ఇల్లాజెప్పాలి. చూడండి రేపుమీరు ఆముదం త్రాగాలి. చిట్టిపాపకు వారానికొక పర్యాయం పడతాముగదా. అది త్రాగితే మీ శరీరానికి ఎంతో ఆరోగ్యంగా, తేలికగా ఉంటుంది. ఉదయాన్న లేపుతాను. లేవండి మీలో ఎవరు అసహ్యించుకోకుండా ఆముదాన్ని తాగుతారో వారునిజమైన వీరులు. అది కొంచెము వెగటువాసనగా ఉంటుందిగాని మనకడుపులోనికి అదిపోయి ఇంతవరకు ఎక్కువైపోయిన పైత్యము, కఫముతీసి విరోచనంగాపోతుంది. అందువల్ల శరీరం చులకనగా హాయిగా ఉంటుంది. చూడండి అది రెండుగ్రుక్కల్లో త్రాగేసే వీరులెవరు? "నేను!" "నేను!!" "నేను!!!" సరే పడుకోండి రేపుత్రాగుదురుగాని.

మరుసటిరోజున ఆముదంగిన్నె పెద్దకుర్రవానినోటికందించి "అసహ్యంగా ఉందని ఉమియకూడదు దీని ఖరీదు ఒక పావులా!"

అట్లా వరుసగా త్రాగించవచ్చు. అది అయిన వెంటనే వాళ్లఅభిరుచుల ననుసరించి లవంగమొగ్గో, లేక యాలకుగింజో, లేక పంచదారో, నోటిలోవేసిన పిల్లలు సంతోషంగా వెళ్లిపోతారు. అందులోను త్వరగా మ్రింగినవానిని ఛష్టు, నీవే వీరుడవు అని అంటే తరువాత వారుకూడా ఉషారుగా త్రాగుతారు. ఇది నా యనుభవం.

పి. జె. శాంతమ్మ






మనము మామూలుగా చేసే ఆకుకూరలలో ములగాకుకూడా ఒక సాధకంగా చేసుకో వచ్చును.

(చేయు విధము)

లేతములగాకు తీసుకువచ్చి పరిశుభ్రముగావేరి, దాన్ని సన్నగా తరగవచ్చును. లేదా ఆకుపళంగా వెయ్యవచ్చును. అటుల నీరును ఎసరుపెట్టి దానిలో ఈపరిశుభ్రపరచి ఆకును వుంచవలెను. అటులవుంచిన కొద్దిసేపటికి మెత్తబడును. దాన్నిఒక పెద్దపళ్లెములో ఆర పెట్టవలెను. ఒకగిద్దెడు పచ్చికందిపప్పు నానపోసి అటులనానిన దాన్ని బాగాకడిగి, పచ్చిమిరపకాయలు అల్లంవేసి, తగుమాత్రం వుప్పువేసి మెత్తగా రుబ్బవలెను. పొయ్యిమీద బాణలివుంచి, నెయ్యికానీ, లేకడాల్డాకానీపోసి బాగా యఱ్ఱగాకాగినాక మినపప్పు వేసి అదిదోరగావేగినాక జీలకఱ్ఱ, ఆవాలు, వేయవలయును. తదుపరి కరివేపాకువేసి ఈ రుబ్బివుంచిన కందివుండను దానిలోవేసి, అట్లకాడతో త్రిప్పుతూవుంటే యఱ్ఱగావేగి పొడిపొడి అగును. కాస్తనీరువుండగా ఈవాంపిన ఆకును దానిలోవేసి కలపవలెను. అలావేసినాక దించి భుజిస్తే చాలారుచికరము, ఆరోగ్యము. ఇష్టమున్నవారు వుల్లిపాయ ముక్కలుకూడా వేసికొనవచ్చును.

గోవిందరాజుల సీతారాం.

వెన్నవుండలు చేయువిధానము

1 శేరు బియ్యము నీళ్లలోనానబోసి దంచి 2 సార్లుజల్లెడ పట్టవలెను. పిండిఆరకుండా దానిలో, 30 తులముల మంచివెన్నపూస, పెరుగు, వుప్పు, కారము వేసి ముద్దఅయ్యేలాగున కలపవలెను. కుంకుడు గింజలంత వుండలుచేసి కొంచమువత్త వలెను. బాణలిలో నెయ్యివేసి బాగుగా కాగినతర్వాత ఈ వుండలు కొంచెము, కొంచెము వేసి వేయించి తీయవలెను. డబ్బాలోగాని, సీసాలోగాని పోసిన నెలరోజులైనను చెడకుండ నుండును.

వెన్నవుండలు పాకముపట్టి చేయువిధానము

పైనచెప్పిన విధముగా బియ్యము నానబోసి అలాగే జల్లెడపట్టవలెను. పిండి ఆరకుండా దానిలో, 30 తులముల మంచివెన్నపూస, పెరుగు, వుప్పువేసి ముద్దఅయేలాగున కలిపి కుంకుడుగింజలంత వుండలు గుండ్రముగచేసి వేయించవలెను. శేపిశెబెల్లము (తియ్యగా, గట్టిగా, తెల్లగా వుండవలెను.) చితకకొట్టి కొంచెము నీళ్లుపోసి పొయ్యిమీద

పెట్టి వుడికించవలెను. పళ్లెములో నీళ్లుపోసి పాకును కొంచెము నీళ్లలోవేసి వుండగా చేసి పళ్లెమునకు కొట్టవలెను. ఘల్లుమని మ్రోగిన వెంటనే దించి వేయించియుంచిన వుండలు పాకులోవేసి కలియబెట్టవలెను. కొంచెము వుండకట్టును కనుక వేడియుండగనే విడదీయవలెను. డబ్బాలోపోసి పెట్టుకొనిన రుచిగావుండును.

కోళ్లపూడి అన్నపూర్ణమ్మ.

## సేమ్యావుప్మా

సాధారణముగా మనము చేసుకొనే ఫలహారములలో యిదికూడా ఒకటి.

చేయువిధము :- ముందుగ సేమ్యాను శుభ్రముచేసి వుంచుకోవలెను. తరువాత ఒకగిన్నెలో ఒకమిల్లిగరిటెడు నేయి వేయవలెను. అదిబాగా కాగినవెనుక యీ శుభ్రము చేసివుంచిన సేమ్యాను అందులోవేసి గరిటతో వేయించవలెను. కొద్దిఎర్రరంగుగా వేగినతరువాత దానినితీసి ఒకపళ్లెములో పోసివుంచవలెను. తరువాత ఆగిన్నెలో 8 మిల్లి గరిటెలనూనె వేయవలెను. అదికాగిన తరువాత రెండు ఎండుమిర్చిముక్కలు, కొద్దిగా వుద్దిపప్పు, ఒక చారెడు శనగపప్పు, కొద్దిగా ఆవాలువేసి వేయించవలెను. బాగావేగిన వెనుక పచ్చిమిరపకాయల ముక్కలు, 10, కొద్దిగా అల్లము, కరివేపాకు వేయవలెను. ఇవి బాగావేగి కమ్మనివాసన వచ్చినవెనుక, సేమ్యా 1 కి 2 నీళ్లుపోసి, కొద్దిఉప్పువేసి, మూతపెట్టవలెను. ఆనీళ్లు 2 పొర్లులువచ్చినవెనుక మనము వేయించి వుంచిన సేమ్యాను, అందులోపోసి కలియపెట్టవలెను. పదినిముషాలు మూతపెట్టి వుంచవలెను. తరువాత దింపి నిమ్మకాయరసము పిండుకొని తినినచో చాలారుచికరముగా వుండును వంటికి ఆరోగ్యము. కావలసినవారు ఉల్లిగడ్డలు వేసుకోవచ్చును.

నిడుమోలు జానకి.

# బ్రతుకు తెరువు

నేడు భారతయూనియన్ ప్రభుత్వమున్నూ, రాష్ట్రప్రభుత్వములున్నూ - ఆహారసమస్య నెదుర్కొనుటకై తీవ్రమైన ప్రయత్నములు చేయుచున్నారు. మరియు ఆహారధాన్యముల కొరత తీర్చుటకు ఇతర పదార్థముల నారగించుటయు అవసరమని చెప్పుచున్నారు. కావున చిరుగడదుంపలు, (గెనుసుగడ్డలు,) వేరుశనగపప్పు, అరటికాయలు పండ్లు - ధాన్యమునకు బదులు తినదగిన పదార్థములు అని ఇందుకుగాను యూనియన్ ప్రభుత్వమువారిచే ఏర్పరుపబడిన ఉపసంఘ సభ్యులనుచున్నారు. ఈ సంఘములో మన వారైన శ్రీ శొంఠి వెంకటరామమూర్తి పంతులుగారున్నూ ఉన్నారు. ఈ రెండున్నూ స్త్రీలకు మంచి బ్రతుకుతెరువు మార్గములు.

## హెచ్చు పండించుట

ఆలుమగలిద్దరున్న చిన్న కాపురమైనను నాలుగుబిందెల నీళ్లైన స్నానమునకు, గుడ్డలుతుకుటకు, చేతులు కాళ్లు కడుగుకొనుటకు, పాత్రలుతోమి కడుగుటకు, ఇల్లుకడుగుటకు ఇంకా ఇతర పనులకు వినియోగింపక తప్పదు. ఈ నీటిని వృథపోనివ్వరాదు. రెండుగజముల చదరమున్న దొడ్డియున్ననుచాలును. అక్కడ ఒక్క అరటిపిలక వేసినట్లైతే - దానంతటిది కొద్దినెలలలో నేఎదిగి - గెలవేయును. ఆ గెలతోపాటు ఆ చెట్టుకొట్టివేయునాటికి మరొకపిలక పెద్దదై గెలవేయును. ఇట్లెడతెగక ఆ పాదు వర్ధిల్లును. పూవునుండి కాయలన్నియు వెడలిన తర్వాత తుదిన పూవులోనుండి కాయకాయు కేసరములు రాలిపో నారంభించును. అప్పుడు ఆ పూవుకోసికొన్న ఒకరోజు కూరయగును. ముందు గెలపైయుంచున కాయలు ముదురును. పక్వమెరిగి కాయలు కోసుకొను చుండినచో - వరుసగా పక్షము రోజులైనను కాయలు కోయవచ్చును. ఎడతెగక కూరచేసుకొని తినవచ్చును.

అరటిపిలక వేయగా నింకను స్థలమున్నచో - మెంతి, చుక్క, తోటకూరలు మున్నగునవి పెంచి తినవచ్చును. లేదా పదిజొన్నగింజలుగాని మొక్కజొన్నగింజలుగాని చల్లినచో - నీవు మరేమియు కష్టపడనక్కరలేకుండానే అవిపుట్టి పెరిగి కంకులువేసి ఫలించును.

## ప్రత్యామ్నాయ ఆహారములు

ముఖ్యముగా చిరుగడదుంపలు. వీనినే గెనుసుగడ్డలని కొన్ని ప్రాంతములనందురు. ఇవి ఎఱ్ఱగాను తెల్లగాను రెండురకములుగానుండును. వీనిని ఉడకబెట్టి తినవచ్చును; నిప్పులపై కాల్చియు తినవచ్చును. ముక్కలుగాతరిగి తియ్యకూర చేసుకొనవచ్చును. వంకాయతో కలిపి గోరుపులుసు వేసి కూరచేసుకొనవచ్చును. పులుసులో ముక్కలుగాతరిగి వేసుకొనవచ్చును. ఉత్తరాదివారి ధప్పళముగాగాని, దక్షిణాదివారి సాంబారుగాగాని చేయవచ్చును. పెసరపప్పులో వేసి జారుడుపప్పుగా వండుకోవచ్చును. ఇన్నివిధములుగా నిది ఉపయోగపడుచున్నది. అయితే దీనినితినిన అందరికిన్ని సరిపడదు. కొందరికి వాతముచేసి పళ్లునొప్పులు కలుగును. నడుములు పట్టుకొనిపోవును. అట్టి దుష్ఫలితములు రాకుండ తగువైద్యుల సలహాలు పొందవలెను. మనము నిత్యకృత్యమున తినేకాయ గూరలలో - ప్రతిదిన్నీ, శైత్యమో, పైత్యమో, వాతమో, వేడియో చేయునట్టివే అయిఉన్నవి. అయితే ఆ దోషమును విరుచుటకు దానితో చేర్చు ఉప్పుపులుసు కారములో, ఇంగువ, ఆవ, అల్లములో ఉపకరించుచున్నవి. వానిని అనుభవజ్ఞులైన ముసలమ్మలనడిగిన తెలియగలవు.

అయితే ఈ చిరుగడదుంపలు ఏడెల్లకాలము నుండవు. ఉన్నకాలమున హెచ్చుగాకొని వరుగుచేసి యుంచుకొనవచ్చును. వరుగు నీళ్లలో నానవేసి, కూర పులుసు పప్పువగైరాలు చేసుకోవచ్చును.

ఉత్తరహిందూస్థానమున వీనిని పొడిచేసి రొట్టెలపిండిలో కలిపి కాల్చి తినుచున్నారు. నెహ్రూజీ అట్లు చేయుచున్నాడు. ఇందుకుగాను ఈ పిండిచేయుట, అది చెడకుండ కాపాడుట ఎట్లని పరిశోధనలు జరుగుచున్నవి. వీనిని యంత్రములలో గాక గృహపరిశ్రమగా చేయించవలయునని కూడ ఈ కమిటీవారు యోచిస్తున్నారు. అంటే అది స్త్రీలకు చక్కని బ్రతుకుతెరువగును.




శ్రీకరు భక్త వశీకరు శుభ చరితం॥
తందానతాన॥
ప్రాకటముగ సద్భక్తిని దలచంగ.
పెక్కు జన్మముల పెరిగెడి పాపములు
చక్కగ నశించి సమకూరు శుభంబుల్
బుధ సూక్తిని గని పుణ్య ఫలము కొఱకై
మధుసూదను సచ్చరితము విందాము
బాల గీత యును భక్తిలీల వ్రాసి
భారతీయ సంసేవకు దలపోసి
శ్రీ పోలాకి శ్రీనివాస రావు .
బమ్మెర పోతన భాగవతము నరసి
భక్తి రుక్మిణీ కల్యాణము వ్రాసె
హరి చరితంబని యాత్మలోన దలచి
దురుసు దనంబున దోసగు లెంచ వలదు
భక్తికి మించిన పరమార్థము గలదా ?
శక్తి కొలందిగ భక్తిలోన మునిగి
స్థిర బుద్ధిని హరి చరితము విందాము.
శ్రీ కరంబుగా సకల సిరుల తోడ
చెలంగు చుండెడి విదర్భ దేశమున
కుండిన నగరము రాజధాని గాను
మెండు విభవములు నిండియుండ గాను
భీష్మకుండను రాజు ఏలుచుండె
భీమ పరాక్రమ వంతుం డాతండు
విద్దెలలో గడు వివేక వంతుండు
ధర్మ గుణంబున, దానకర్ణు డతడు
ఆ మహా రాజున కార్గురు సంతానం

వచనం॥

రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులను ఐదుగురు కుమారులున్నూ రుక్మిణీయన్న కుమార్తెయున్నూ జన్మించియున్నారు.

కడసారమ్మున గలిగెను రుక్మిణి
కనకపు బొమ్మ బాలిక రుక్మిణి



మిశ్రం॥

దిన దిన ప్రవర్ధమానము గాగ
పశ్చిమ దిశలో బ్రకాశ మొందెడి
చంద్రరేఖ తన యందము జూపే
చందముగా నా బాలిక రుక్మిణి
పెరుగుచు నుండెనుగా ॥తందానతాన॥
ఏడున కేమా ఎదుగుచు నున్నదిగా!
ఈడు పిల్లలతో నాడుచు నున్నదిగా!
వదినా మర్దల వావి వరస లల్లి
బొమ్మరిండ్లను గట్టుచు నుండెనుగా!
బొమ్మల పెండ్లిని జేయుచు నుండెనుగా!

వచనం॥ మఱియు,

గుజ్జన గూళ్లను వండుచు నుండెడిది
గురుతుగ చెలులకు వడ్డన జేసెడిది
బంగరు టుయ్యాల నూగుచు నుండెడిది
బాలల తోడను బంతుల నాడెడిది
ఉద్యాన విహారము జేసెడిది
ఉల్లాసంబున మొక్కల బెంచెడిది
బోదెలు కట్టి యానందించెడిది.

పూల మొక్కలకు నీళ్లను బోసెడిది
వృథగా గాలము వెచ్చము జేయకను
విడువక శాస్త్రాల్ జదువుచు నుండెడిది
వీణా గానము సలుపుచు నుండెడిది
వినయ విధేయత మెలగుచు నుండెడిది
పేదల యెడ గడు మోదము జూపెడిది.

మిశ్రం॥

గోరువంకలను పావురమ్ములను
హంసల, జిలుకల హరిణమ్ములను
యనురాగముగా బెంచుచు నుండెడిది ॥తం॥

అయ్యో చెట్టును కాయలె చెప్పునుగా!
సుగంధ మునకే సూనము విలసిల్లు
మంచి గుణంబులు గలవారల కీర్తి
ఎంచి చూడ బ్రపంచము నిండునుగా!
రుక్మిణి గుణములు దిశలు యందు వెలసె
రుక్మిణి కీర్తి లోకమెల్ల నిండె.

(సశేషం)



# బాలప్రహ్లాద

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

(1949 ఏప్రిల్ సంచిక తరువాయి)

౬ వ రంగము

ఆచార్యులవారి గృహము (చండామార్కులు ప్రవేశించినాల్గు వైపుల కలయజూచి ఒక్కరులేరు ఎక్కడకు పోయినారో)

(తెరలో)

మాధవ గోవింద హరేముకుంద
శ్రీధరవామన శ్రితజనానంద
కేశవనారాయణ వాసవవినుత
వాసుదేవాచ్యుత వరద సనంద

చం: (ఆలకించి) ఎక్కడనో భజన కాలక్షేపం జరుగుచున్నట్లున్నది. ఈ వెధవలక్కడ లేరు గదా! (బిగ్గరగా) ఒరేయి కాలాహి! గరళ గంతా! అశనీ! భైరవా! భేతాళు! అందఱు ఎక్కడకు పోయినారురా? ఒక్కరు కనిపించ రేమిరా?

(బాలురందరు ఒక్కొక్కరే వచ్చి నిలబడి) ఇక్కడే ఉన్నామండి.

చం: అందఱు వరుసగా నిలబడండి. చేతులు జోడించండి, ప్రభువందనం చేయండి, ఓం హిరణ్యకశిపాయనమః.

బా: ఓం కేశవాయనమః.

చం: ఏదీ స్పష్టంగా పలకలేదే! అందరు ఒక్కమాటు బిగ్గరగా అనండి ఓం హిరణ్యకశిపాయనమః

బా: ఓం నారాయణాయనమః

చం: (తెల్లబోయి చూస్తూ) అయ్యో నారాయణాయనమః అంటున్నారేమిటి? ఆ నారాయణుడి పేరెత్తితే చింతబరికెలతో వీపులు చిట్లగొడ్తాను. ఏమనుకుంటున్నారో జాగ్రత్త. ఏది మూడవమారు గట్టిగా అనండి, ఓం హిరణ్యకశిపాయనమః.

బా: ఓం మాధవాయనమః

చం: ఒరేయి ఇదేమి ప్రేలుడురా! మీకుబుద్ధిలేదా? ప్రభువుగారి పేరనమంటే విష్ణుమూర్తి పేరంటా రెందుకు? మనకు ప్రభువే దైవము! తల్లి, దండ్రి, అధికారి, ఆయన నామమే మనము సర్వదా స్మరించవలె. ఆయననే పూజించవలె, ఆయనకే నమస్కరించవలె. నారాయణనామ స్మరణచేయుచున్నాడని ప్రభువుగారు ప్రహ్లాద కుమారునే శిక్షించుటకు పంపినారు. ఇక మిమ్ములను బ్రతుక నిచ్చునా? ఏవీ మీ పాఠ్యపుస్తకములు?

బా: ఆ చెత్తతొట్టిలో పడవేశామండీ.

చం: ఆ! ఆ! ఏమి! చదువుకొను పుస్తకములు చెత్తతొట్టిలో పడవేసినారా! మీకే దయ్యమో భూతమో పట్టలేదుగదా? పిచ్చియో వెఱ్ఱియో ఎత్తలేదుగదా?

బా: ఏమీపట్టలేదండి. అందరము బాగానే ఉన్నామండి.

చం: అయితే పుస్తకములేల పారవైచినారు?



కాలాహి: మేము మీవద్ద చదువుకోమండి.

చం: ఎందువల్ల?

గరళకంఠుడు: మేము మీరుచెప్పే పాఠాలు బాగా లేవండీ.

చం; ఎందుకు బాగా లేవు.

అశని: దేవుడి కథలు మీరుచెప్పనే చెప్పరు. మేమిక మీవద్ద చదువుకోమండి.

చం: మరెవరివద్ద చదువుకొనెదరు?

భైరవుడు: ప్రహ్లాదుడి వద్ద.

చం; ప్రహ్లాదుడికేమి వచ్చును?

భై; అతనికి బలేమంచి దేవుడి పాఠాలువచ్చు.

బాలురు: (అందరు) అతనికి మంచి భజనగూడా చేతనవును (సంతోషంతో చంకలు కొట్టుకుంటూ) మాకందరికి నేర్పుతాడు, బాగా ఆడుతాం పాడుతాం.

చం: (నెత్తి నోరు కొట్టుకుంటూ) అయ్యో! అయ్యో! ఇదేమి కర్మము యిట్లా మొదలు పెట్టారు. రాజకుమారుడు విష్ణుభక్తి మానక పోయెనే! బంగారువంటి బిడ్డను రాజుగారు నిష్కారుణంగా చంపబంపెనే! ఎట్లాబ్రతికి వచ్చినా అని నేను దుఃఖపడుతుంటే మీరు గూడా ప్రహ్లాదుని మతము మొదలు పెట్టారే! ఏమిచేయను? నాయనలారా! మీరు చిన్న పిల్లలు. చదువుకొని అభివృద్ధిలోనికి రావలసిన వారు. చదువులు మానుట సమ్మెలు కట్టుట మీకు ఉచితమైన పనిగాదు, గురుధిక్కారము ప్రభుధిక్కారము ఎంతవారికి పనికిరాదు. రండి నామాట వినండి. చదువుకోండి. మీకు మంచిమంచిబహుమానము లిప్పిస్తా. పంచదార చిలుక లిస్తారండి. పుస్తకాలు తెచ్చుకోండి, చదువుకోండి.

బా: ప్రహ్లాదకుమారుడు వచ్చిన తరువాత-

చం: (కన్నులనీరు తుడుచుకుంటూ) ఇంకెక్కడి ప్రహ్లాదుడు! ఆ రాక్షసాధములు అప్పుడే కాజేసి ఉంటా...రు

(తెరలో)

శరణం భవకరుణామయి
కురు దీనదయాళో,
కరుణారస వరుణాలయ
కరిరాజ కృపాళో!

బాల: (అందరు ఆలకించి) అడుగో మాప్రహ్లాదుడు (అని పరుగెత్తుతారు.)

చం: ఆయుష్మంతుడు సుఖముగా వచ్చినాడు సంతోషమే; కాని-ఈరాజపుత్రుని సాంగత్యము వలన బాలకులెల్లరు హరిభక్తులైపోవుచున్నారు. ఏమిదారి?
(పిల్లలందరు ప్రహ్లాదుని ముందు పెట్టుకొని చేతులతో భజనచేస్తూ)

మాధవ గోవింద! హరేముకుంద!
శ్రీధర! వామన! శ్రితజనానంద!

అంటూవస్తారు.

చం: (వారినిచూచి గాభరాపడుతూ) అమ్మ నాయనోయ్, ఆ విష్ణుభజన నావద్దచేయకండోయ్; నాతలపోతుందోయి; మీ దుంపలు తెగోయి, రాజుగారితో చెప్తానోయ్, చావు దెబ్బలు కొడ్తారోయి (అని అడావిడిగా పరుగెత్తి పోతాడు. పిల్లలు శాంతంగా మరికొంతసేపు భజనచేసి వెళ్లుతారు.) (తెర)

# శ్రీకాకుళ మహిళాసంఘం ఏకాదశ వార్షికోత్సవము



ఒరిస్సా శాసనసభకు ఉపాధ్యక్షురాలైన శ్రీమతి ఆ. లక్ష్మీబాయి M. L. A.గారి అధ్యక్షతను శ్రీకాకుళ మహిళాసంఘం యొక్క 11వ వార్షికోత్సవము సంఘ ఆవరణ యందు ఈనెల 10 వ తేదీని జయప్రదముగ జరుపబడెను. కార్యదర్శి నివేదికానంతరము అధ్యక్షురాలు దేశపరిస్థితులు—మహిళాసంఘముల కర్తవ్యముగూర్చి ప్రసంగించిరి. సంఘసభ్యులలో నొకరగు శ్రీమతి వంగా చిట్టెమ్మగారిచే చిత్రింపబడి బహూకరింపబడిన కీ. శే శ్రీమతి సరోజినీదేవి చిత్రపటమును లక్ష్మీబాయిగారు ఆవిష్కరించి చిట్టెమ్మగారి కళానైపుణ్యమును అభినందించుచు సరోజినీదేవి ఘనతనుగూర్చి ముచ్చటించిరి. సంఘ సభ్యులు తమకృతజ్ఞతాసూచకముగా నొక వెండికప్పును శ్రీమతి చిట్టెమ్మగారికి బహుకరించిరి.

తదుపరి స్త్రీవిద్యనుగూర్చి పెమ్మరాజు సీతామహాలక్ష్మమ్మగారు "దేశం ఎలామరమ్మత్తు చెయ్యడం" అనువిషయముపై శ్రీమతి M. రాజేశ్వరిగారు, స్త్రీజనాభ్యుదయముగురించి శ్రీమతి సీ. శారదాంబగారు, 'మూఢనమ్మకముల'ను గురించి శ్రీమతి ఈ వెంకటలక్ష్మిగారు ఉపన్యసించిరి. సభ్యురాండ్రు కొందరు ఫేన్సీడ్రస్సులతో సభ్యులకు వినోదము కలిగించిరి.

తరువాత శ్రీమతి ఆర్. సుభద్రమ్మగారు తమ గాన కౌశలముచే సభ్యులను మెప్పించిరి. సంఘమువారు తమ కృతజ్ఞతాసూచకముగ నొకరజితపాత్రను ఆమెకు బహుకరించిరి అధ్యక్షురాలైన శ్రీమతి లక్ష్మీబాయిగారు సంఘము చేయుచున్న కృషినభివందించి సంఘమునకు రూ 25/—విరాళమునొసగిరి. వందనములతోను జాతీయగీతముతోను సభముగిసెను.

ఇట్లు డి. సువర్ణాభాయి. కార్యదర్శి.



బొంబాయిలోని

"గేట్ ఆఫ్ ఇండియా"

ఒకవైపుదృశ్యము

ఛాయాచిత్రకారుడు : సి. సీతారాం, విజయనగరం.



# రీటా తల వెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనవేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్:** ఉత్తమమైన హెయిర్ టానిక్, కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్‌కుమార్:** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను:

**కన్నాంబ:** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి:** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్ఠమైన హెయిర్ టానిక్ - అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనమును చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు అహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజ రక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ:** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్




# ఇంటిపొదుపు — వంటచెరుకు

M. సుశీల

వడుచులకాపరం - చితుకులమంట అన్నసామెత క్రొత్తగా యేర్పరచుకొన్న దంపతుల కాపరానికి వర్తిస్తుంది. చితుకులమంట సురసుర యిట్టే - పొయ్యిమీద పెట్టిన వంటపాత్ర వేడెక్కకుండానే మండి పూరకుంటుంది. అలాగే చేతిలోకి వచ్చిన నాల్గుడబ్బులు రెండుదినాలలోనే అనవసరము, అవసరము అనే విచక్షణలేకుండా ఖర్చుపెట్టేస్తారు క్రొత్తదంపతులు. తరువాత కల్గిన అవసరాలకి డబ్బులేక నానాబాధలు పడతారు. దీనికంతకీ కారణం సంసారంలో వుండవలసిన పొదుపు నేర్చుకోక పోవడమే. సంసారికి ముఖ్యలక్షణం పొదుపు. అది అలవరచుకోకపోతే ఆ సంసారం తాడు బొంగరం లేనిదిలా నడుస్తుంది.

చాలామందికి పొదుపుకీ, పీనాసితనానికి అర్థం తెలియదు. పొదుపుగా వుండే స్త్రీని, దుబారాగా ఖర్చుపెట్టే స్త్రీచూచి "అబ్బే ఆవిడ వుత్తపీనాసి, బాబూ" అని హేళనగా అనడంకూడా కద్దు. ఒళ్లు తెలియని దుబారావుండడం ఔదార్యలక్షణంకాదు. ఆవిడకి సంసారం నడపడం చేతకాదన్నమాట. ఓనాడు - వున్ననాడు నవాబులాగ, లేని నాడు ఫకీరులావుండడం పొదుపు తెలియని కుటుంబాల నిత్య అనుభవం. ఉన్ననాల్గురోజులు రెండుచేతులతో విచ్చలవిడిగా ఖర్చుపెట్టుకొని నవాబులా వుండి తర్వాత - చేతులుకాలాక ఆకులు పట్టుకొన్నట్లు ఫకీరులా ఐపోవడం ఎందుకో! ఎప్పుడూ సంసారం, ఎటువంటి వడుదుడుకులు లేకుండా సాఫీగా నడవాలంటే పొదుపు చాలా అవసరం.

ముఖ్యంగా ఈ రేషనుదినాల్లో పొదుపుమరీ అవసరమని చెప్పాలి. ప్రభుత్వం కూడా మనకి ఈ విషయాన్నె దివారాత్రులు నేర్పుతూంది. ఈ రేషన్ దినాల్లో పొదుపు తెలియని సంసారాలు ఎంతగా సతమతమవుతున్నారో అందరికీ తెలుసు. బహుశ ఈ గడ్డుదినాలు మనకి ఒకందుకు మంచికే వచ్చాయేమో? ఎందుకంటే ప్రస్తుత పరిస్థితులు మనచేత నిర్బంధంగా పొదుపుగా వుండేలా చేస్తున్నాయి.

వంటచెరుకు విషయంలోకూడా పొదుపుగా వుండాలనగానే నా స్నేహితు

రాంధ్రమంతా నా ప్రసంగంవింటూ నవ్వవచ్చును. పొదుపు అనేది చాలాఖరీదుగల వస్తువుల వాడకం విషయంలోనే కాదు. నిజానికి ఖరీదుగల వస్తువులు మనకి ముఖ్యమైన జీవితావసరాలు కానేకావు. అందుచేత ఎంత దుబారాగా ఖర్చుపెట్టే వ్యక్తియైనా ఖరీదుగల వస్తువుల వాడుకలో తనకు తెలియకుండానే పొదుపుగా వుంటుంది. ఎటొచ్చీ నిత్యావసరాల వస్తువుల వాడకంలోనే ఎంతో జాగ్రతపడాలి. తెల్లారిలేస్తే నిప్పు, నీరు కావాలి. ఇవిరెండూ లేకపోతే ఆటకట్టడుతుందన్న సంగతి అందరికీ తెలిసిందేగా. నిప్పు రాజెయ్యడానికి ఎంత కిరసనాయిలు, ఎన్ని కాగితాలు, ఎన్ని అగ్గిపుల్లలు ఖర్చుపెడతారో! అప్పటికీ నిప్పు రాజెయ్యలేకపోతారు.

వంటచెరుకు నిత్యావసరమని మనకు తెలుసును. వంటచెరుకు వాడుకలో ఎంతో పొదుపుకావాలి. లేకపోతే, సంసారం ఎంతో లాక్‌సాన్‌లో పడుతుంది. కొంతమంది చాకిబానకింద పెట్టినట్లు ఒక సందెడు కర్రలు వెలిగించి పొయ్యిలోపెడతారు. తమాషా ఏమిటంటే అంతమాత్రం వంటకి అన్ని కట్టెలు అనవసరం. పైగామంట, పొయ్యిమీద పెట్టిన పాత్రకి తగులుతున్నదా లేదా అని చూడరు. పొయ్యి అంటించడం తర్వాత దానిమొహం చూడరు. కట్టెలు పరశురామప్రీతిలాగ సురసురమండి మంట పొయ్యనుంచి దిగజారి కట్టెలు తగలడడమే కనిపిస్తుందిగాని పొయ్యిమీదపెట్టిన యెసరు గోరు వెచ్చగానైనా వేడి ఎక్కదు.

తర్వాత మనవంట ఎన్ని కట్టెలతో పూర్తిచేసుకోవచ్చును, పొయ్యిగాడి పొయ్యిలా వుండాలా లేక పెట్టే కట్టెలమంట పోకండావుండేలా వుండాలా అన్న విచక్షణ కావాలి. ఇదిలేకపోతే వంటచెరుకు వాడుకలో పొదుపురాదు. కొంతమంది భోగిమంటలా తగలేస్తారు. పప్పు అన్నము వండుకుందుకు రెండుపొయ్యిలెందుకో!

వంటచెరుకులో ఎన్నోరకాలున్నాయి. అడవిపుల్ల, సరుగుడుకట్టెలు. సంసారికి సుఖకరమైన వంటచెరుకు సరుగుడు. చక్కగా ఎంతో సులువుగా, కళ్లు చిల్లులు పడేలా పొయ్యిలో తలదూర్చి పొగపీలుస్తూ వూదనక్కరలేదు. సరుగుడుకట్టెలతో చక్కగా యిట్టే పొయ్యి రాజుకుంటుంది. పొగతక్కువకూడాను. ఇక అడవి పుల్లలంటారా, కొంచం యిబ్బందే. ఎంతసేపటికి రాజకోవు పైగా మండుతూన్నా బుస్సలు కొట్టినట్లు పొగ. సరుగుడు ఖరీదు. అడవివంటచెరుకు కాస్తచవక. పొదుపు కావాలంటే, యిబ్బందిలేకండా వంటచేసుకోవాలంటే రెండూ కొనుక్కుంటేసరి. పొయ్యి రాజుకోవడానికి, బాగామండడానికి అడవి కర్రలతోబాటు, రెండు సరుగుడు కర్రలు జతచేసి పొయ్యిఅంటిస్తేచాలు. పైగా పొదుపుకి యీ విధానం లాభదాయకమే కాకుండా, సరుగుడు కట్టెలలా అడవి కర్రలు బొత్తిగా మసి ఐపోవు. కర్రకాలి బొగ్గులు

తయారవుతాయి. పొదుపు చేతకానివారు, కర్రలని అలా మండనిచ్చి వంటైన వెంటనే నిప్పులను ఆర్పక అలా పొయ్యిలో నుసి అయిపోయేలా వుంచేస్తారు. పొదుపుగావుండా లంటే వంటైన వెంటనే పొయ్యిలోంచి ఆ నిప్పు బయటికితోడి ఆర్పేయ్యాలి. ఆర్పితే యింట్లోకి బొగ్గులుకూడా అమురుతాయి.

ఇంతేకాక బొగ్గులమీద వంటచేసుకుంటే మనకు ఇంకాలాభము. ఎందు కంటే పొగవుండదు, కళ్లుపాడవవు. వంట అతివేగంగా కొంచెము బొగ్గులతో తయా రవుతుంది. గిన్నెలు మసిబారవు, తోముకునేందుకు సులువుగావుంటాయి. ఈ బొగ్గు లలో వచ్చేనుసి పారేయకుండా, పేడతోకలిపి వుండలుచేసి యెండబెట్టినఎడల, అవి బాయి లర్ లో వేసి, వేడినీరు కాచుకోవచ్చును. ఈ బాయిలర్ లో ఇంకా చిన్నచిన్న పేళ్లు, చితు కులు, రంపంపొట్టు, పిడకలుకూడా వుపయోగించుకోవచ్చును.

ఇంకొకరకమైన పొయ్యికూడావున్నది దీనిమీద ఒకేసారి మూడురకా లయిన పదార్థములను చేసుకోవచ్చును. కొంచెం కట్టెలతో వంట అవుతుంది. ఒక పొడుగాటి పొయ్యికి వరుసగా మూడుకంతలు వుంటాయి, అయితే కట్టెలు పెట్టేందుకు మాత్రం ఒకటే దోవ వుంటుంది. మనకి సెగ ఎటువైపుకు కావాలంటే అటువైపుకి తిప్పుకోవచ్చును. కట్టెలు ఎక్కువ పట్టవు. వేడినీళ్లు కాచుకోడానికి పొట్టుపొయ్యిలు కూడా వుపయోగించుకోవచ్చును. ఈవిధముగా అనేకవిధాల పొదుపు చేసుకోవచ్చును.

ఒక్కకర్ర అంటించి వంటంతా చేసేవారున్నారు. ఆ వంటనే వండడానికి సందెడు పుల్లలు వాడేవారున్నారు. దేనికైనా పొదుపుకావాలని ఇందుకే చెప్పాను. పొదుపులేని సంసారం చాలా యిబ్బందులు పాలవుతుంది. ఆఖరికి వంటచెరుకు విష యంలోకూడా పొదుపు తీసికోడం అవసరం.

(ఆలిండియా రేడియో మద్రాసు బ్రాంచివారి అనుమతిని.)



# శ్రీ బాలయోగి దివ్యచరిత్ర

కందర్ప శ్రీరామమూర్తిగారు, బి. యస్. సి.

"మాలలు మాత్రము మనుష్యులు కారా! మాలలు మాత్రము దేవుని ధ్యానించుటకు తగరా!" అని ఋజువు చేయుటకు కలియుగమున మాలకులమున అవతరించిన మహానుభావుడు మన బాలయోగి. ఇతడు అమలాపురగ్రామ సమీపమున 8 మై॥ దూరమున ముమ్మిడివరము అనుగ్రామమువద్ద హరిజనకుటుంబములో జన్మించెను. ఇతనితండ్రిపేరు కటికల గంగయ్య, తల్లిపేరు వెంకమ్మ. ఇతనిపేరు సుబ్బారావు. ఇతనితల్లి చిన్నతనముననే మరణించెను. చిన్నతనమున అయిదారుసంవత్సరముల తర్వాత గోవులను కాయుచు తోడిబాలురతో కలసిమెలసి కొంతకాలముగడపెను. అప్పుడప్పుడు గోవులమీద శ్రద్ధ వహించక తదేకదృష్టిగ కొన్నిగంటలకాలమును గడుపుచుండెడివాడు. ఇతనికి ఆపనియందు శ్రద్ధలేక, పశువులయజమానులచేత మాటపడుచుండెను. సుమారు పండ్రెండు సంవత్సరములు వయస్సు యున్నప్పుడు, ఒకరోజున తోడిబాలురతో 'వాల్మీకి' సినిమాకువెళ్ళెను. అచ్చట వాల్మీకి తదేకదృష్టితో ధ్యానించుట చూచి తానుకూడ అతనివలె దేవుని పూజింపవలెనని ఆసక్తి పుట్టెను. 22-6-1946 సం॥ శనివారం, హఠాత్తుగ ఆ గోవులనన్నిటిని వదలిపెట్టి యొకకృష్ణుని విగ్రహము ఎదుట పెట్టుకొని ధ్యానించుట ప్రారంభించెను. "పువ్వు పుట్టగానే పరిమళించును." అను రీతిచొప్పున ఆబాలుడు వెంటనే ధ్యానయోగ సమాధిలోనికి వెళ్ళిపోయెను. ఆవిధముగా ఒకేసారిగ ధ్యానసమాధికి పోవుట పూర్వజన్మ వాసన అని చెప్పకతప్పదు. పూర్వజన్మ సుకృతఫలవిశేషముచే యోగసమాధి అప్రయత్నముగ లభించి యొక కొబ్బరితోట యందు యోగనిష్ఠాపరుడయ్యెను. పిమ్మట తండ్రిబలవంతముగ ఇతనిని యింటికి తీసుకొనివచ్చెను. కాని వెనువెంటనే మరల ఆపల్లెకు నూరు గజముల దూరములోనున్న ఒకపుంతవద్ద తపస్సు ప్రారంభించెను. అచ్చటి ప్రజలు ఒక చిన్న కుటీరమును నిర్మించిరి. ఒకనాడు ఎవరికి తెలియకుండ నాబాలుడు ఆ కుటీరంబున ప్రవేశించి తపస్సు మొదలుపెట్టెను. తపస్సుప్రారంభించిన రెండు మూడు నెలలువఱకు స్వల్పముగ పాలను, స్వీకరించెడినాడు. అతనివద్దనుంచిన పాలయందు మహత్తుఏమనగా రెండు మూడుమాసములైనను, ఆపాలు చెడిపోయేవికావు. అప్పుడే పితికిన పాలవలె యుండేవి.



తర్వాత ఆపాలు స్వీకరించుటకూడ మానివేసి యోగనిష్ఠతో గోముఖాసనముమీద కదలకుండా యుండెను. అతనియెదుట యొకకృష్ణుని విగ్రహముతప్ప మరియేమియు లేదు. ధ్యానము ప్రారంభించిన తర్వాత యితనియందు చాలమార్పులువచ్చెను. పూర్వము నల్లనివర్ణముగలబాలుడు తపశ్శక్తిచేత పచ్చని బంగారపు చాయగలవాడయ్యెను. ఇన్నిదినములనుండి భోజనముచేయకపోయినను ఈతనిముఖము బ్రహ్మవర్చస్సుకలిగియుండెను. ఇదివఱకు వాలిపోయియుండిన శిరోజములు ప్రస్తుతము వాటియంతట యవిపైకిలేచి కొప్పురూపముదాల్చి జడలుకట్టుకొనినవి. ఆయన కదలడు, మెదలడు, ఎవరితోను మాట్లాడడు. ఈకలియుగమున అవతరించిన ప్రహ్లాదుడా, ధ్రువుడా యన్నట్లుండును. ఎన్నోవేల సంవత్సరములకు పూర్వము అవత

రించిన ధ్రువుని మనము చూడలేకపోయినను, ప్రస్తుతము యీకలియుగమున అవతరించిన ధ్రువుని చూడవచ్చును.

ఆహారమును రహస్యముగ పుచ్చుకొనుచున్నాడాఅని అనుమానముతో కాపలాకాచి పరీక్షించి విఫలమనోరథులైరి.

ప్రజలు ఈమహానుభావునిజూచుటకు గుంపులు గుంపులుగ ఆబాలగోపాలము దూరప్రదేశమునుండి సహితమువచ్చుచు పోవుచుండిరి. ఈవిధముగ ప్రజలువచ్చుటచేత యితని యోగనిష్ఠకు కొంచెము ఆటంకము సంభవించుచుండెను. ఒకరోజున అనగా 6-2-49 తేదీన, కాకినాడ కాపురస్థులలో శ్రీ వ్యాసం సత్యరాజు గారు ఇతనిదర్శించుటకు పగలుపన్నెండుగంటలకు వెళ్ళెను. అంతవరకు ఎవరితోను మాట్లాడనివారు ఈతనితో కొన్నిగంటలు సంభాషించెను. "ప్రజలసంచారమువలన తనతపస్సునకు భంగముకలుగుచున్నదనియు, ఎవరు రాకుండ తలుపులుమూయించి తాళమువేయించవలెననియు, కొంచెము పాలు, నీరు దైవారాధన నిమిత్తము కావలెననియుకోరెను. రాజమండ్రీ సబ్‌జడ్జి గరిమెళ్ల కృష్ణమూర్తిగారిని 10-2-49 తేదీని, అర్ధరాత్రిసమయమున తీసుకొనిరావలెనని కోరెను. వారు కోరినట్లు ఆనాడురాత్రి 11 గంటలకు, వారినితీసుకొనివచ్చిరి. ఆయనతో ఆరాత్రి 11 గంటలు మొదలు 3 గంటలవరకు అధ్యాత్మిక విషయము లనేకములగూర్చి ప్రసంగించి, తన జన్మపరంపరలలో ప్రస్తుతము జన్మము చివరదనిచెప్పెను. తపోభంగము కాకుండ తలుపులన్నియు మూయించ వలెననియు, ప్రజలదర్శనార్ధము సంవత్సరమునకొకసారి మహాశివరాత్రి ముందురోజున దర్శనముచేయవచ్చు ననియుచెప్పిరి. ప్రజలు, తలుపులు మూయవద్దని గోలపెట్టినప్పటికి తలుపులన్నియు మూసివేసిరి.

ఒకదినమున కొందరు భక్తులు దర్శనార్ధమురాగానే తలుపులు వాటంతట అవే భళ్లుమని తెరచు కొనినవి. వారి దర్శనమైనపిమ్మట తలుపులు వాటియంతట యవియే మూసికొనినవి. ఈ యనదగ్గర మహత్తరమైన విషయమేమనగా ఎవరైన నిజమైనభక్తులు జూడవల్లయునని కోరికయున్నయెడల తలుపులు వాటియంతట యవితెరచుకొని మరల మూసుకొనిపోవును.

అటుపిమ్మట మమ్మిడివరం గ్రామస్థులందరు ఆబాలయోగియున్న గదితలుపులు వేయకూడదని గట్టిగా యందరుకలసి యేకకంఠముగాననిరి. అట్లు రోజంతము తెరచుటకు వీలుపడదని ఉదయము 4 గంటలుమొదలు, 6 గంటలవరకు తలుపులుతెరచి యుంచబడుననియు అటుపిమ్మట మూసియుంచవలెననియు ఆయనచెప్పిరి. ప్రస్తుతము ఈరోజువరకు ఆవిధముగానే జరుగుచున్నది. ఆరోజు మొదలు నేటివరకు ప్రజలు తీర్ధప్రజలవలె గుంపులు గుంపులుగ చాలదూరమునుండి ప్రయాసలకోర్చి ఆ చేలగట్లలయొద్ద రాత్రిమూడుగంటలవరకు పరుండి అటుపిమ్మట వారిని దర్శించిపోవుచుండిరి. నిర్మానుష్యమైన ప్రదేశము జనమయమైన ప్రదేశముగమారినది. అమలాపురమునుండి ప్రత్యేకముగ రాత్రి రెండుమూడుగంటలకు, మూడు నాలుగుబస్సులు ప్రయాణీకుల సౌకర్యమునిమిత్తమై తిరుగుచుండును. అచ్చట ఎన్నో కాఫీహోటళ్లు నూతనముగ వెలసినవి. ఈతనిపటములు ఎన్నోస్థలములయందు విక్రయింపబడుచున్నవి. ఇదివరకు ఇంతపేరు ఊరులేని గ్రామము ప్రస్తుతము పుణ్యక్షేత్రముగ మారినది.

దర్శించునప్పుడు వీరిని ఎవ్వరు ముట్టుకొనకూడదు, గుమ్మము మొద్దనుండియే చూచిపోవలెను. మాట్లాడుటకు ప్రయత్నముచేయకూడదు. అప్రయత్నముగ డబ్బుగాని, బహుమతులుగాని వచ్చిన, అది బీదలకు, అన్నదానమునకు వినియోగించవలెననిజెప్పిరి.

పుష్పగర్భమునుండి పరిమళములు వ్యాపించునట్లు ఈబాలయోగి హృదయమునుండి వెలువడిన ముఖ్యమైన భోధనామృతము లేమనగా;

1 భగవంతుని ధ్యానించుటకు అరణ్యమునకు పోవలసిన అవసరములేదు. మనస్సు నిబ్బరముచేసుకొని ఎచ్చటనుండియైనను ప్రార్థింపవచ్చును.

2 భగవంతుడు అన్నిచోట్లను వ్యాపించియున్నాడు. ప్రహ్లాదుడు చెప్పినట్లు ఇందుగలడు అందు లేడని సందేహము యుండకూడదు. ఏలనిన, ఎందెందు మనసార వెతికిన అందందు గోచరించును.

3 దేవాలయము చుట్టునున్న పువ్వులు ఎవ్వరుకోయగూడదు. అవి రాలినతీసుకొనవచ్చును. ఏలనిన పూలయందుకూడ జీవాత్మయున్నది.

4 మానవులందరు జాతిమతభేధములేకుండ భగవంతుని ధ్యానించుటకు అర్హులు.

5 ఈ జన్మలో భగవంతుని తెలుసుకొనుటకు ప్రయత్నముచేసిన ముందుజన్మలో పైమెట్టుకు పోవుటకు వీలుపడును.

6 ధనములు, భూములు శాశ్వతములు కావు. ప్రపంచమున అనుభవించు సుఖములు యన్నియు క్షణ భంగురములు. భగవంతుడొక్కడే శాశ్వతము.

7 భగవంతుని తెలిసికొనుటకుముందు తాను ఎవరో తెలిసుకొనవలెను.

8 తపస్సుకు ముఖ్యముగ మనస్సునిలకడగ నుంచుకొనవలెను.

9 మానవజన్మ వృధాగా పోనియ్యకూడదు.

10 పంచేంద్రియములను జయించుటకు ఆహారనియమము చాలఅవసరము. మంచిపాలుతప్ప మరేమియు భుజింపకూడదు. వానిని జయించినతర్వాత ఆపాలుకూడ అవసరములేదు. పంచేంద్రియములు ఆత్మలో అణిగిపోయి జీవాత్మ పరమాత్మలు కలసిపోవును. ఆజీవాత్మ పరమాత్మలయమునకే ముక్తియనబడును. ఆ ముక్తిపొందుటకు ప్రతిమానవుడు సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని మనసార పూజించవలెను.

# "అపహృత హృదయము"

" అపహృతను, పరాధీనను, దగ్ధపురాభాగ్య సౌధమును తిలకించు నిత్యదుఃఖినే; విపరీత వేషభాషాచార మతములకు తలొగ్గిన దౌర్భాగ్యురాలనే! హృదయమన్న. దుర్భరావమానముచే రేకెత్తు శత్రుప్రతీకారములో, కాలి కాలి, ఎఱ్ఱబడి ఒక్కుమ్మడి హఠాత్తుగా నిస్పృహా నిరాశలలో ముంచబడి చల్లారి దుర్బలమగుచున్నది. శరీరమను కొందమా, అనుక్షణ భయంకర రావరిచిత వాతావరణమున నిర్బంధితమై, కిరాతకులకు క్రీడాకందుకమైనది. ఛీ, ఛీ, జాతికి, వంశమునకు, జన్మభూమికి తలవంపులు గల్గించిన ఈ బ్రతుకు దుస్సహము సుమీ! మంచిది, ఈజీవచ్ఛవమును సంస్కరించుటకు ప్రకృతిమాత, నేడు నావల్ల సుప్రసన్నురాలయినట్లు తోచుచున్నది. ధన్యోస్మి - ధన్యోస్మి!"

" నిశీథమా, నీనడియాడు గొంతుకనొత్తి, సర్వప్రాణుల జోగొట్టి నిద్రపుచ్చితివి. లేదు, లేదు. మానవజాతి మాత్రము దుర్నీతిదురాశా భూతప్రభావమున వెఱ్ఱెత్తి, పోరు పెట్టుచు నిన్ను సుఖింపనీయదు. నాబోటి అభాగ్య దుఃఖభాగులును, నీ లాలిసుఖము గ్రోలనిమాట వాస్తవమే కాని నా యీ ఆక్రందనము నీకు వినబడనిది విసిగింపనిదిగదా".

" ఓయీ, మానవుడా, సృష్టిలోగల ఎనుబది లక్షల జీవరాసులలో అగ్రగణ్యుడవా? అదెట్లు? ఒకవంక విశ్వకల్యాణాశయములు, మతములు, ధర్మములు, సంస్కరణములు, రాజకీయములు, వైజ్ఞానిక శాస్త్రములు, కళోపాసనములు, ప్రచారము చేయుచు, వేఱొకవంక ఖండఖండాంతరములలో, దేశదేశములమధ్య, జాతిజాతినడుమ, వ్యక్తి వ్యక్తి నందునగూడ, తగవులు, పోరాటములు, మహోగ్రసంగ్రామములు అంకురింపజేసి, స్వజాతినెల్ల రక్తస్రవంతులలో ముంచి తేల్చుటయా నీయగ్రగణ్యత? నీతిమాలిన కళుపుల కొందఱి వెంటబెట్టుకొని పెత్తనములు, అధికారములు, ప్రభుత్వములు కైవసమొనర్చుకొని, స్వప్రయోజనముల కడ్డు నిల్చినచో, సృష్టినెల్ల జంకుగొంకులు లేకుండ నిమిషమాత్రమున నిర్మూలించుటకును, అవినాభావసంబంధితుల విడదీయుటకును సమర్థుడవనియా, నీయగ్రగణ్యత? లేక ఆత్మవత్సర్వభూతాని యని కీర్తించు సత్యశాంతిదూతలను కాల్చివేయగల్గిన ధీరుడవనియా? కాకున్న ఒక్కచిటికలో బహువ్యయప్రయాసఫలితమైన ఒక అమూల్యమగు అనితర లభ్యకళారూపమును నీయర్థరహితమైన ఆక్రోశాగ్నిలో భస్మీభూత మొనర్పగల భారతకౌశికుడ వనియా నీయాధిక్యత? మఱెచ్చటనోయీ నీజాత్యున్నతి?"

"మనుష్యుడా, నీజాతకము ఎట్టి లజ్జాకరమైనది! అసురుడవై, సార్వభౌముడవై, దేవతవై, మఱి ఋషివయ్యును కామదాసుడవని పేరెక్కితివి. అపూర్వమారణాస్త్ర నిర్మాణ చతురుడవనియు, అద్వితీయ దిగ్విజయ పరంపరోన్నతుడవనియు, అనంత భూమండలాధికారివనియు విఱ్ఱవీగకుము. కామినీకాంచన పదార్చకుడవై, ఒరులచితుల్లపై

నీయదృష్టము నిర్మింపదలచు నందాక, నీవుమానవు డెట్లగుదువు? శాంతియేది? మృగ స్వభావములు నీ కుపాస్యములైనప్పుడు ఉన్మాదము, కండకావరము, పైశాచిక ప్రవృత్తియేగదా నీయభీష్టసిద్ధులు?"

"ఓజగత్ప్రభో, ఒక్క సంశయము ఈదీనురాలికి. నీచిఱుగినుక నివ్వెరవలో దూదిపింజవలె మండిపోదగు ఈక్రూరుని ఇక్లేల నిరాఘాటముగ పోనిత్తువు? నీయాస్తిక్యము, నీసృష్టి స్థితిలయకారకత్వము, సంశయాత్మకము అవహాస్యము కావా? స్వామీ, నీప్రభుత్వములో గూడ కిరాతకులకు జయగీతములు వినబడుచున్నవే? సమాధానమీయవా? కలుషితననియా? అహో, దైవమా, ఏమని ప్రత్యుత్తరము? పరప్రయోజనమునకు ఓషధి మర్దనములలో నలిగి నలిగి, పిండబడి, పుటములలో ఆహుతియై, పిమ్మటగాని తనయఖండ శక్తితో దుర్ఘట వ్యాధిని నిర్మూలించదన్న సత్యమే, సాధువులు దుర్మార్గుల చేష్టలకు గుఱియాటలోని రహస్యమనియా నీవనుచుంటివి? కృతార్థురాలను ముహూర్తానికి. అయినచో ఈ నీ, యభీష్టము నిర్దాణమైన జగత్తునకు ఒక మేలుకొలుపన్నమాట. భయంకరమయ్యు నిట్టిలోక ప్రకంపములు, అత్యవసరములు, అప్రతిహతములన్నమాట. అహో, ప్రభూ, అజ్ఞానురాలను. నీసృష్టి కళారహస్యము గ్రహింప జాలకపోతిని; ఇదియే కైమోడ్పు తిరస్కరింపకు."

"అదిగో వేగుచుక్క వచ్చినది. భావతరంగధ్వని ప్రతిధ్వనులలో దానిదర్శింపనైతిని. ఈఘోర సర్పదష్టమైన దారుసమానదేహమును ప్రక్షాళించెదను. దీనిని గుఱించి ఏడ్చు దేశముగాని, జాతిగాని, ఆత్మీయులుగాని తుదకు ఆత్మగానిలేదు. ఇది యొక త్యాజ్యమై, నింద్యమై, దూషితమై, నిరుపయోగమైన అనాథ శవము. దీనియంత్యక్రియలు కొనసాగించి దాని చితాభస్మరాశి గంగామతల్లికా స్పర్శముచే పవిత్రీకరించెదనుగాక."

(డాక్టరు) పి. వేం. గోపాలరావు

# కేసరి తెలుగు ఎలిమెంటరీ స్కూలు, త్యాగరాయనగరం.



త్యాగరాయనగరం (మద్రాసు)లో చాలమంది ఆంధ్రులున్నారు. కాని వారికి తెలుగులో ప్రాథమికవిద్య చెప్పే సౌకర్యాలులేక వారు చిరకాలంగా బాధపడుతూ వచ్చారు. అంత అక్కడి పెద్దలు కొందరు కోరగా శ్రీకేసరిగారును కేసరిహైస్కూలు కమిటీవారున్నూ యోచించి కేసరిహైస్కూలు బ్రాంచిగా త్యాగరాయనగరంలో ఒక ఎలిమెంటరీస్కూలును "కేసరి తెలుగు ఎలిమెంటరీ స్కూలు" అనే పేర నెలకొల్ప డానికి తీర్మానించారు. ఇందుకు స్థానికులైన పెద్దలు పలువురు తగు ప్రోత్సాహమిచ్చారు.

ఈ "కేసరి తెలుగు ఎలిమెంటరీ స్కూలు" త్యాగరాయనగరములోని వీరరాఘవాచారి రోడ్డున నెం 1 రు గృహమునందుంచబడినది. ఇది రిటైర్డు సెషన్సుజడ్జి శ్రీ మన్యం వెంకట్రామయ్యగారి బంగళా. వారు దీనియందు శ్రద్ధతీసుకొంటున్నారు. వారి కుమార్తె శ్రీమతి పి. అన్నపూర్ణగారు ఈ స్కూలునకు ప్రధానోపాధ్యాయురాలు. శ్రీమతి యమ్. లక్ష్మీఅమ్మగారు మరొక ఉపాధ్యాయిని. ఈనెల 4-8-49 వరకు చేరిన బాలబాలికలు 37 మంది.

కేసరితెలుగు ఎలిమెంటరీ స్కూలునకు 17-7-49న ప్రారంభోత్సవము జరుప బడెను. శ్రీ సామి వేంకటాచలంశ్రేష్ఠిగారు అధ్యక్షతవహించిరి. శ్రీయుతులు మన్యం వెంకట్రామయ్య, నరసింహరాజు (సర్వీస్ కమిషన్ సభ్యులు) బండి శ్రీహరిరావునాయుడు, (రిటైర్డు జిల్లాకలెక్టరు) కందాళ సూర్యనారాయణగారు (గవర్నమెంటు చీఫ్ తెలుగు ట్రాన్స్లేటర్) పంచాగ్నుల సూర్యనారాయణ, లింగమూర్తి, కల్నల్ టి. యస్. శాస్త్రి, ఆదిశేషయ్యనాయుడు (రిటైర్డు గవర్నమెంటు అఫిషియల్) మైదవోలు శేషాచలపతి, నేతి సుబ్రహ్మణ్యం, బులుసు సాంబమూర్తి, విఠల్ రాధాకృష్ణయ్య ప్రభృతులెందరో పెద్దలు సభనలంకరించిరి.

సభకు విచ్చేసినవారికందరికి ద్వారమువద్దనే పుష్పచందనాదుల సత్కారము జరిగినది.

అధ్యక్షుని కిర్వంకల శ్రీ కేసరిగారును, శ్రీ సాంబమూర్తిగారు నాసీనులైరి.

అధ్యక్షులు శ్రీ వేంకటాచలంశ్రేష్ఠిగారు కేసరి ఎలిమెంటరీ తెలుగుస్కూలును ప్రారంభించుచు - చెన్ననగరమున తెలుగుభాషకు పూర్వముండిన మన్నన నుగ్గడించి,

నేటి అధోగతిని వివరించిరి. ప్రాస్తావికముగ ఆంధ్రరాష్ట్రప్రయత్నమును తడవిరి. అయితే మద్రాసు ఆంధ్రులు తిరిగీ తమ నిజశక్తిని తెలుసుకొనుచున్నారనియు, అట్టిదాని కిట్టి పాఠశాలలే నిదర్శనమనియు తెల్పిరి. శ్రీ కేసరిగారి వితరణమును, విద్యాప్రియత్వమును ప్రశంసించిరి. పిదప నరసింహరాజు, శ్రీహరిరావునాయుడు, రాధాకృష్ణయ్య, ఆదిశేషయ్య నాయుడు, పంచాగ్నుల సూర్యనారాయణ, వెంకట్రామయ్యగార్లెల్లరు పాఠశాలఅభివృద్ధిని కోరుచు, తమతమ బిడ్డలచదువునకై పడ్డపాట్లెల్ల వివరించి, అట్టిఇబ్బందులనెల్ల తీర్చుచున్న శ్రీ కేసరిగారి దానవిశేషము నుగ్గడించుచు ఉపన్యసించిరి. శ్రీ సాంబమూర్తిగారు రాగల ఆంధ్రరాష్ట్రములో మద్రాసునుచేరుట ఇట్టిసంస్థలకు పుష్టికరముగాన అందులకై ఎల్లరు కృషి చేయవలయుననిరి.

పిదప శ్రీ కేసదిగారు - అవసరమని తెలిసి ఇచ్చట ఈ పాఠశాల నెలకొల్పుటకు పూనుకొంటిమనియు, దీని పురోభివృద్ధికి ఇచ్చట నివసించు ఆంధ్రులెల్లరు ఉత్తరవాదులనియు, తమ్ముగూర్చి చెప్పినవారి కెల్లరకు కృతజ్ఞుడననియు - చెప్పిరి.

అధ్యక్షుని అంత్యవాక్యములతో ఉత్సవము ముగిసినది. శ్రీ కేసరి తెలుగు ఎలిమెంటరీ పాఠశాల నాటినుండిసాగుచున్నది. కొంచమాలస్యముగ ప్రారంభమైనదిగాని లేకున్న ఇంకను హెచ్చుగా పిల్లలు చేరెడివారు.

['మద్రాసు మాది' అని గుండెలు బాదుకొనువారికన్నను, స్ఫుటమును, స్థిరమును అగు సేవాసహాయములను శ్రీ కేసరిగారీరూపమున చెన్నపురి తెలుగువారికి గావించుచుండుట ప్రశంసార్హము. వారి సత్సంకల్పబలమున నిట్టిసంస్థలు తామరతంపరలుగా వృద్ధిబొందును గాక అని ఆశించెదము.

గా॥ వెం॥ ]

# పీడితులైన పిల్లలకు అనేక

## పుష్కరాల నుంచి సేవ



పసితనమున బల్ల (లివర్) వ్యాధిచే పీడించబడుతూన్నవారికి, జమ్మివారి "లివర్ క్యూర్" అనేక పుష్కరాలనుండి సహాయకరమగుటచే వేలానవేల అమూల్య ప్రాణాలు రక్షింపబడినవి.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు, డాక్టర్లు సామాన్యావస్థలో "సింపుల్" క్యూరును. క్లిష్టావస్థలో 'కాంప్లికేటెడ్' క్యూరునూ చికిత్సగా వాడుచున్నారు. 'సింపుల్' లివర్ క్యూరును చిన్న మోతాదులవాడుక, ఆకలినీ జీర్ణశక్తినీ వృద్ధిపరచి మలబద్ధకమును పోద్రోలి లివరు, ప్లీనులు క్రమపద్ధతియందుండునట్లుచేసి, వ్యాధులురాకుండ ఉపయోగించును.

పిల్లలందు లివర్, ప్లీనులు తల్లినిబట్టి యేర్పడుతాయి. దీనిని అనుసరించుకొనియే 'జమ్మివారి టానిక్' ఆయుర్వేద సిద్ధాంతానుసారంగా తయారైనది గనుక, బల్లవ్యాధిచే పీడింపబడిన పిల్లలయొక్క తల్లులు గర్భిణులైనప్పుడు ఈ 'జమ్మివారిటానిక్'ను సేవించుట ఉత్తమం.



## జమ్మివారి
# లివర్ క్యూర్

అన్నిచోట్లా దొరకును

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు,

మైలాపూరు, మద్రాసు, ఫోన్ నం॥ 8139

ఇతరచోట్లు: బెజవాడ, విజయనగరం, కలకత్తా, బొంబాయి, లక్నో, బెంగుళూరు, తిరుచునాపల్లి, etc.

# స్వర్ణోత్సవ వికాసము
# నర్తనశోభ




## పండిత డి. గోపాలాచార్యులవారి
# జీవామృతము

ఆ యువపురుషులూ ఆరోగ్యమూర్తులు. నిశ్చింతగా మధురమయ నర్తనలో హాయిగా కాలము గడుపుతారు. ఆజంట నాట్యమాడుతూ కాదు, పదిసరములలో నిత్య వసంతోత్సవ శోభ వెల్లి విరిసేలా చేస్తారు. అర్ధశతాబ్దముగా ప్రసిద్ధ బలవర్ధక రసాయనముగా పేరొందిన "జీవామృతము" వీరిలోనూ ఆ ఉత్సాహ బలానందములు ప్రజ్వలించేలా ఆవేశం చేయగలదు.

## ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
(స్థాపితము 1898)
మద్రాసు. 17

# మనసుకలత

శ్రీమతి గుడిపాటి వెంకటసుబ్బమ్మగారు

(గతసంచిక తరువాయి)

ఇల్లా కాలం గడుస్తూ ఉండగా బెంగుళూరులో ఒకనాటిరాత్రి మూర్తిగారు నిద్రపోతున్నారు. ఏదో పెద్దశబ్దంవినపడి మెళుకువచ్చింది. కమలగదిలో ఏదో మూలుగులా వినవచ్చింది. అకస్మాత్తుగా గదితలుపు తీసుకుని ఎవరో బయటికి వెళ్లిన చప్పుడుకూడా అయింది. మూర్తిగారు వరాండాలోకి వచ్చిచూచారు. కమలగది తెరిచివుంది. ఆమె గదిలో డ్రెస్సింగు టేబిల్ దగ్గిర క్రింద పడివుంది స్పృహ లేకుండా. ఆమెకు గాయం తగిలింది కాబోలు మొఖం అంతా నెత్తురు. రవిక చీరకూడా కొంతవరకు నెత్తురుతో తడిసివున్నాయి. వెంటనే మూర్తిగారు లోపలికి వెళ్లారు. ఆయనకి ఆదృశ్యం చూడ ఆశ్చర్యం వేసింది. "ఇదేమిటి కమలా? ఏమయింది, దాసుగారుఏరీ?" అంటూ వెళ్లి కమలకి స్పృహలేక పోవడంచూసి వెంటనే లేవతీసి మంచంమీద పడుకోపెట్టారు. ఆమెకు తలమీదగాయం తగలడం గ్రహించి రక్తంకట్టడానికి కట్టుకట్టారు. ఉపచారాలవల్ల కమల తెప్పిరిల్లింది. మూర్తిగారిని చూడగానే ఆమెకి దుఃఖం ఆగింది కాదు. చిన్నపిల్లలా ఏడవడం మొదలెట్టింది. "ఏంజరిగింది కమలా? ఏడిచిన లాభంలేదు. యివాళ దాసుగారు రాలేదా?" అన్నారు. "రాకేం, యిదంతా ఆయన పనే" నంది. మూర్తిగారికి ఆశ్చర్యం మరీ యెక్కువయింది. కోపంకూడా వచ్చింది. "అసలు మీయిద్దరికి దెబ్బలాట యెందుకొచ్చింది" అన్నారు. ఇన్ని రోజులనుంచి దాచిన వృత్తాంతం యీవిధంగా చెప్పడం మొదలెట్టింది కమల.

నేనుపుట్టిన పురిటిరోజుల్లోనేమాఅమ్మ చనిపోయిందిట. అప్పటినుంచి మాతండ్రిగారి చెల్లెలు (భర్తపోయినఆమె) మామేనత్త నన్ను పెంచింది. ఆమెకి ఒకడే కొడుకు. అతనే యీదాసుగారు. నాకు అయిదు సంవత్సరాలు వయస్సు వచ్చేటప్పటికే అతనికి 18 సంవత్సరాలుంటాయి. మాతండ్రిగారూ, మామేనత్త కాక మాకు యింకెవరూ ఆప్తులుగాని, బంధువులుగాని వున్నట్టు నేను ఎరుగను. నాకు 8 సంవత్సరాలు వచ్చేదాక మాతండ్రిగారున్నారు. ఆతరువాత ఆయనకూడాపోయారు. మాతల్లి విచారం తెలియదు గాని మాతండ్రిగారు పోయినందువల్ల నాకెంతో దుఃఖమనిపించింది. మాతల్లితండ్రులు లేనిలోటు లేకుండా మామేనత్త చూసేది. మాతండ్రిగారికి భూవసతి ఉండేది. ఆభూమిని, నన్నూకూడా తనచెల్లెలు కొడుక్కి వ్రాసి యిచ్చారట మాతండ్రిగారు. మాతండ్రిగారు పోయినతరువాత మాయింటికి పెద్ద మామేనత్తే. తన కొడుక్కి నాకూ చిన్నతనంలోనే వివాహం చెయ్యాలని అనుకుందిగాని మేమిద్దరం చదువుకుంటూ ఉండడంవల్ల అప్పట్లో చెయ్యలేదు. నాకు 16 సం॥ వచ్చేటప్పటికి కలరాజాడ్యంవల్లఅకస్మాత్తుగా మామేనత్త చనిపోయింది. అప్పటినుంచి దాసుగారే యింటి పెద్ద. తనఇష్టం వచ్చినట్లల్లా ధనవ్యయం మొదలెట్టారు. దురభ్యాసాలలో పడ్డారు. నన్ను పెళ్లిచేసుకోమనికూడా ఒకనాడు నిర్బంధం చేశారు. నాకు యితని దురభ్యాసాలనీ అవీచూస్తే మనస్సులో అసహ్యంగా వుండేది. ఇష్టంలేని యితనిని వివాహం చేసుకుని యీప్రపంచకములో ఏమిఆనందం అనుభవించకలనని అనిపించింది. ఇష్టం లేదని చెప్పినా లాభంలేదని తెలుసు. మోసంచేసి తప్పించుకోవాలని బుద్ధిపుట్టింది. నాకుయింకా చదవాలని వుందనీ అదిఅయితేగాని పెళ్లిచేసుకోననీ అప్పటికి తప్పించుకున్నాను. భగవంతుని దయనాయందు వుండడంవల్ల అప్పటికి వప్పుకున్నారు. అతి తాగుడువల్ల గుండెలు వూపిరితిత్తులు ఏజబ్బుకు లోనయ్యారో కాని ఆయన మంచంయెక్కి ఒక సంవత్సరం ఖాయిలా పడ్డారు. ఆయనకి జబ్బుగా ఉండగానే నేను యెక్కడికేనా

వెళ్ళిపోయి ఏహోస్పటల్లోనైనా నౌకరీ సంపాదించుకుని కాలక్షేపం చేద్దామనుకున్నాను. అప్పటికే, బి, ఎ, డిగ్రి పొందాను. నా మట్టుకు కాస్త నౌఖరీ దొరకదా, అని ఒకనాడు బట్టలు సర్దుకున్నాను. గాని జబ్బుగావున్న మనిషి; పాపం లేచి మంచినీళ్లైనా ముంచుకుని త్రాగలేని పరిస్థితుల్లో వదిలి ఎల్లావెళ్లిపోను. ఎంత దుర్మార్గుడనన్నా అన్నా చెల్లెలులాగ ఒకచోటే పెరిగాం. చివరకి మనసొప్పింది కాదు. కొన్నాళ్లకు డాక్టరు సహాయంవల్ల లేచారు. మా తండ్రిఆస్తి పూర్తిగా అయిపోయింది. చివరకి అప్పు కూడాచేశాం. ఆవూళ్లోవుంటే మరియాద దక్కదని ఆయిల్లుకూడా అమ్మేసి అప్పులు తీర్చేసి వున్నడబ్బుతో యీవూరుచేరాము. నాలుగు రోజులక్రితమే మాడబ్బు పూర్తిగా అయిపోయింది, నామెడలో బంగారు గొలుసు యిమ్మని యీనాలుగు రోజులనుంచి ఘర్షణ జరుగుతోనేవుంది. నేను ఇవ్వనన్నాను. ఆకారణంచేత నన్నుకొట్టి నాకు స్పృహలేని సమయంలో నాగొలుసు ఎత్తుకుపోయారు. ఇదిజరిగినసంగతి. అనికమల చెప్పేటప్పటికి మూర్తిగారికి మరీ ఆశ్చర్యంవేసింది. 'నాతండ్రి బ్రతికివుండగా ఆయన చేత్తోచేయించారు. ఆయన జ్ఞాపకంగా ఆగొలుసు చూస్తూ వుండేదాన్ని' అనికమల కంటతడిపెట్టింది. మూర్తిగారుచూడలేక పోయారు. 'పోలీసులకి చెప్పి దొంగని పట్టించి నీగొలుసు ఎల్లాగైనా తెప్పిస్తా కమలా' అని వూరుకోపెట్టారు. ఆమాటలే చెప్పుకుంటూఆరాత్రి కమలగదిలోనే వుండిపోయారు మూర్తిగారు. పొద్దున్నే పోలీసుస్టేషనుకువెళ్లి రిపోర్టు యిచ్చివచ్చారు.

మూర్తిగారికి ఆఫీసునుంచి రాగానే కమలపని సరీగ్గా వుంటోంది. ఇంతవరకు దొంగ పట్టుపడలేదు. ఆమెమనసు యేమీబాగుండలేదు. ఆమెకు యెల్లాగైనా విచారం పోగొట్టాలనీ, మనస్సుకి విశ్రాంతి, ఆనందం కలగచెయ్యాలనీ మూర్తిగారివుద్దేశం. రోజూసాయింత్రం యిద్దరూకలిసి బైటికి తిరగడానికి వెడుతోవుండేవారు. ఒకరోజు మామూలుప్రకారం షికారుకివెళ్లే సమయం అయింది. కమల మూర్తిగారి గదిలోకివచ్చి "ఏమండీ యివాళ మీరుయింకా సిధ్ధంఅవలేదేమి? మామూలులా కాకుండా యింకాదూరం వెళ్లాలని వుంది. యివాళ లాల్ బాగ్ కి వెడదామా?" అంది. అల్లాగే వెడదాము. ఎంతసేపు? అయిదు నిముషాల్లో

వ్యవహారా' నంటో సిద్ధమయి, యిద్దరు బయలుదేరారు. రోజూనడిచే వెళ్లడం. అలసట వచ్చేటప్పటికి యింటిమొఖం పట్టడం అలవాటు. యివాళ టేక్సీమీద వెళ్లాలని ఆలోచించి ఒకటికుదిర్చారు. వీరికి దొరికిన టేక్సీ చాలా చిన్నది. వెనకస్థలం యిద్దరు మనుష్యులకి చాలీచాలడంగావుంటుంది. మూర్తిగారు డ్రైవరుప్రక్కకూర్చోవాలని చూస్తున్నారు. 'ఇక్కడ యిద్దరికి చోటువుంది' అంది కమల. సరేయిద్దరూ వెనక సీటులోనే కూర్చున్నారు. లాల్ బాగ్ దగ్గిర దిగేటప్పటికి అయిదుగంటలయింది. ఒకపౌను పచ్చి ద్రాక్షపళ్లుమాత్రం కొనుక్కున్నారు. తిరగడం మొదలెట్టారు. దోవకి యిరుప్రక్కలావున్న ఫ్లాక్స్, కారనేషన్, జినియా, కాస్మాస్ మొదలయిన చిన్న చిన్న పువ్వులమొక్కల సౌందర్యాన్నిచూసి ఆనందిస్తూ తోటలోప్రవేశించారు. సాయంకాలపునీరెండ ఒక్కొక్కచెట్టుమీదపడి సువర్ణఛాయ చిమ్మినట్లు కనుపిస్తోంది. కమల తనఆనందం తెలియపరుస్తూ అంది 'యిక్కడ మాలీలు బహునిపుణులు సుమండీ. చెట్లనిపెంచడము తీగెలను పాకించడము మొదలయిన పనులను ఎంతబాగా చేశారో. ఆమందారవృక్షం యొక్క కొమ్మలు యిష్టంవచ్చినట్లు ఎదగకుండా ఎల్లాకత్తిరించారో చూడండి. పువ్వులవల్లతెలుస్తోంది గాని లేకపోతే అదియేచెట్టో మనం చెప్పలేక పోదుము. మనపక్క మాలీలు యింతబాగా చెయ్యలేరు' అంది.

"అవును కమలా ఆమాలతీలతని ఆచెట్టుమీదకి యెల్లా ప్రాకించారో చూడు. పువ్వులతోవున్న ఆతీగె చుట్టుకోడంవల్ల అచెట్టుకుకూడా అందంవచ్చింది. ఆతీగె కూడా తనకుస్వేచ్ఛగా ప్రాకడానికి తగిన ఆధరవు దొరికిందని ఆనందంతో పుప్పొంగినట్లు పువ్వులను విరపోస్తోంది. అంటూ తనదగ్గిర ద్రాక్షపళ్లు కమలకి కూడా కొన్నియిచ్చారు. యిద్దరు మధ్యమధ్య ద్రాక్షపళ్లుతింటూ ప్రకృతిసౌందర్యాన్ని తిలకిస్తూ నడుస్తున్నారు. 'సుమారు అయిదారు సంవత్సరాలక్రితం మామేనత్త మమ్మల్ని యీబెంగుళూరు తీసుకొచ్చింది. అప్పుడుకూడా యిక్కడికొచ్చాము. కాని ప్రకృతిలోవున్న సౌందర్యం నాకుఅప్పుడు అంతగా తెలియలేదు సుమండీ'. 'అటుచూడుకమలా ఆలేళ్లు మనకేసి యెల్లా చూస్తున్నాయో. జంతువులలోకల్లా సాత్వికమైనవి, అందమైనవీని. మనం యేమన్నాచేస్తామని ఎల్లాబెదిరిపోయినట్లు చూస్తున్నాయో. అంచేతే కవులు వీటికళ్లకీ ఆడవాళ్లకళ్లకీ పోల్చిచెబుతారు' అన్నారు మూర్తిగారు. 'బెదరడంఅంటేజ్ఞాపకను వచ్చింది. ఆవేళ దెబ్బతిన్నభయం యింకాపోలేదు సుమండీ' అంది కమల. యిప్పటికి ద్రోహిని పోలీసువారు పట్టుకోలేక పోయారు. మళ్లీ రేపువెళ్లి తగిన పత్తేదారుని పెట్టిస్తాను కమలా' అన్నారు మూర్తిగారు. 'పోనియ్యండి మూర్తిగారూ, హారంపోతే పోనియ్యండి. హారం కారణంగా ఆద్రోహి యింక నా చుట్టుపక్కలికి రాడు. ఇదీ భగవంతుని దయే. ఆత్రాగుబోతు చేతుల్లోనుంచి ఎల్లాతప్పుకోనా అనే బాధతో మండుతోన్న నాహృదయం వర్షంకురిసినట్లు చల్లపడింది. మీ పక్కని వున్నంత మట్టుకు నాకేభయం లేదని ధైర్యం తెచ్చుకున్నాను. యిప్పుడు నాయిష్టంవచ్చినట్లువున్నా నన్ను అడిగేవాళ్లులేరు. అంచేత నాకంటికి అతను కనపడకుండా వుంటేనే నయమని నాకోరిక' అంది కమల. యిల్లా మాట్లాడుకుంటూ చీకటి పడడంవల్ల మోటారు యెక్కారు.

మెడ్రాసులో సుశీలాంబకి వంట్లో ఆరోగ్యంగా వుండటంలేదు. అన్నహితవులేదు. రాత్రి సరిగ్గానిద్ర పట్టదు. ఏదోపిల్లల సదుపాయంకోరకు లేవక తప్పకలేస్తోంది. ఒకనాడు వంటయింట్లో ఎదో పనిచేసుకుంటోంటే పోష్టుబంట్రోతు ఉత్తరం తెచ్చియిచ్చాడు. చేస్తూన్నపనినికూడా మరిచిపోయి తక్షణం ఉత్తరం విప్పి చదవడం ప్రారంభించింది సుశీలాంబ.

"చి. సౌ. సుశీలకి,

నీకు ఉత్తరం వ్రాయడం ఆలశ్యమయిందని నువ్వు ఖంగారు పడతావనీ నేననుకుంటూనే వున్నాను. నావంట్లో ఆరోగ్యంగానే ఉంది. కమల విషయం యిదివరకు నీకువ్రాస్తూనే వున్నాను. ఆమెతో వున్నతను ఆమెభర్త కాడట. ఒకనాడు ఆమె మెడలో హారం ఎత్తుకుని పారిపోయాడు. ఇప్పటిదాకా వెతి

కించడం అడావడిలో తీరుబడిలేక నీకు ఉత్తరాలు వ్రాయడం ఆలస్యం అయింది. నేను ఒకవారంలో వస్తాను. నాట్రయినింగు అయిపోవచ్చింది. యిప్పుడు కమల నిస్సహాయమైన అనాధబాల. వొదిలిపెట్టి రావడం మనస్కరించడంలేదు. బహుశా మెడ్రాసు తీసుకురావలసి వస్తుందేమో అనుకుంటున్నాను. ఇంతేసంగతులు.

ఇట్లు

ప్రేమైకమూర్తి

పూర్తిగాచదివి ఉత్తరంమడిచి చేత్తో పట్టుకుని ఆలోచిస్తూంది సుశీలాంబ.

"మొదటి ఉత్తరాల్లో వారు అని, కమలమ్మగారని వ్రాశేవారు, రానురాను కమలలోకి దిగింది. నావృత్తరానికి అశ్రద్ధకి కారణం కమలపనా? అనాధబాలట! యీమెని యీవూరు తీసుకొచ్చి ఏంచెయ్యాలో నాకు అర్ధంకావటంలేదు. నెలా పదిహేను రోజుల్లో ఒకపరాయి తెలియని ఆడదానితో యింతచనువుగా యెల్లాగ వుండగలిగారు. పురుషులస్వభావాలు యింత సులువుగా మారగలవా? అందులోనూ నాభర్త ప్రపంచకంమాదిరి కాదని నానమ్మకము; కేవలం ధర్మదేవత అనుకున్నాను." అని యింకాయేమేమో ఆలోచిస్తూ గదిలోకెళ్లి పడుకుంది. ఆమెమళ్లీ ఉత్తరంచదువుదామని విప్పింది. క్రిందమూర్తిగారి సంతకం వుంది. నీప్రేమైకమూర్తి అనిచూడగానే అప్రయత్నంగా కళ్లవెంటనీళ్లు జలజలా రాలాయి. ఎందుకో ఆమెకే తెలియదు. మనస్సు బాగుండక ఆపూట భోజనం చెయ్యలేదు.

(సశేషం)

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: పి. సాంబయ్య
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్చి. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
పిఠాపురము: యం. సూర్యరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు సూర్యరాజు.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం: సిటి. న్యూస్ ఏజన్సి.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
బళ్ళారి: యస్. గురునాథ్
నెల్లూరు. ఎ. వి. నారాయణయ్య.
విజయనగరము : పి. నారాయణప్పడు.
కడప : వై. వి. సుబ్బారావు.
గుత్తి: వి, హనుమంతాచార్.
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజిపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతిపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వార్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె. దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సిపట్నము: సి. రామం.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి. గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వరరావు.
తిరుపతి : ఆర్. చంచల్ రావు
చీరాల. పి. సూర్యనారాయణ
పుత్తూరు : ఎ. యస్. ఎ. అయ్యర్.
గణపవరం : ఆర్. సుబ్బారావు.
కొడవలూరు : జి. వీరరాఘవులు.
కూచిపూడి . జి, సీతారామయ్య.

హిగిన్బాతమ్ స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.




కిరస్తానీ గృహాభ్యుదయోద్యమము తరఫున మద్రాసు కిరస్తానీకళాశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ కురువిళ్ల జాకోబ్ గారిట్లన్నారు:—

“మంచి పౌరులు తప్పనిసరిగా బుద్ధికుశలులు, పండితులుకారు. నిజమైన ఉత్తమ జీవితవిధానము ఆ వ్యక్తి బుద్ధికుశలతనుబట్టి, పాండిత్యాన్నిబట్టి నిర్ణయింపజాలము ప్రేమ, శాంతము, కారుణ్యము, వినయము, ఇతరులను మన్నించడము, ఉత్సాహము, సానుతాపము, విశ్వాసము - ఇత్యాది సుగుణగణముతే జీవితాని కవసరమని తలుస్తున్నాము. మనవాళ్లతోగాని పైవాళ్లతోగాని వ్యవహరించేటప్పుడు - ఈమేలి గుణాలే రాణించేవి. గొప్పచదువులు చదివినవారే కోపమొస్తే ఎంతఘోరమైన పనైనాచేసేస్తున్నారు. కాబట్టి నిజమైన నాగరికతకుమూలం పెద్దచదువులుకావు నైజగుణాలు; అంటే శీలసంపత్తి పాఠశాలల్లో పిల్లవాళ్లతో వచ్చేసమస్యలకు మూలము వాళ్లకుటుంబాల స్థితిగతులు అని తేలుతుంటుంది. ఒక పిల్లవాడెందుకు అబద్ధం చెప్తాడు, ఎందుకు ఇతరపిల్లలను వేధిస్తాడు, ఎందుకు దొంగతనాలు చేస్తాడు, పగటికలలు కంటుంటాడు - అనేది ఆరాతీస్తే వానిఇంటి పరిస్థితులల్లాంటివి. అని తెలుస్తుంది. కేవలం హెడ్మాస్టరు వానిని దండించి లాభంలేదు. ఒకడు చిరునవ్వునవ్వుతో కులాసాగా ఉండడానికి, మరొకడు నీరుసమైనమూడ నేరక అవస్థపడడానికి కారణం ఒకనికి ఇంటివాతావరణం అనుకూలమైనది; మరొకనికి కాదు.

తయారగుచున్న భారత రాజ్యాంగచట్టం చిత్తులో ఇదివరకు ఉప్పుమీద పన్ను వేయరాదు - అని నిషేధం ఉండేది. దానిని తొలగించవలెనని ముసద్దీ కమిటీవారు సమ్మతించారు. రాజ్యాంగ చట్టసభలో చర్చజరిగింది. ఓటింగుకు పెట్టేముందు అధ్యక్షుడు రాజేంద్రబాబు ఈ విధంగా ఉపన్యసింపగా ఆ సవరణ నిలిపియుంచడమైనది:—

“శాసనోల్లంఘన మారంభించు సమయమున పేదవాడిచ్చుకొనేపన్నులలో ఉప్పుపన్ను నిరాకరింపదగినదని గాంధీ ఎంచుటలో కారణంలేకపోలేదు. నిరుపేద బిచ్చగాడున్నూ ఈ పన్నులో తనభాగం చెల్లిస్తున్నాడు - అని ఆయన తలచాడు; మనము అలాగే అనుకున్నాము. అందుచేత ఈ పన్ను నిరాకరింపమని హెచ్చరించాడు. దేశమంతా అంటుకొనిపోయింది. అతిస్వల్పమైన ఈ పన్ను నిరాకరించడం వల్ల పెద్దప్రమాదంలేదని తలచినవారూ ఉన్నారు. అయితే మూడువారాలలో ఆ సేతుశీతాచల మధ్యములో ఈచట్టము నుల్లంఘించనిగ్రామం ఒకటైనా కన్పించలేదు. ఈ రోజునైనాసరే మనమీ ఉప్పుపన్ను తిరిగీ వేశామంటే - మళ్లీ దేశమంతా దద్దరిల్లేటి మహోద్యమం సాగుతుంది. కాబట్టి గాంధీ సాగించి విజయంగాంచిన ఉప్పుసత్యాగ్రహమహోద్యమానికి చిహ్నంగా - ఈ నిషేధం - మనక్రొత్త రాజ్యాంగ చట్టంలో ఉండడం సబబు.”

భారతయూనియన్ ప్రభుత్వములో ఆరోగ్యమంత్రి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ గారు బొంబాయియందలి థాకర్సే ఇండియన్ వుమన్స్ యూనివర్సిటీ కాన్వొకేషన్ అడ్రసు నిచ్చుచు నిట్లుచెప్పిరి:—

“స్త్రీభార్య, తల్లి కావాలెనని ఈశ్వర నిర్ణయము; అందుకు ఆమె తయారుకావలెననియే నా విశ్వాసము. అయితే. ఆమె కార్యరంగము వివాహముతో ఏల సంకుచితమై పోవాలెనో నాకు తెలియడంలేదు. చదువుకోడాని కవకాశముగల ప్రతియువతి చదువుకొని ఏదైనా ఒక వృత్తికి తర్ఫీదు పొందాలి. అని కోరుచున్నాను. వివాహానికిముందు కనీసము 5 సంll ల పాటైనా (ప్రజా) ప్రభుత్వముక్రింద సేవచేయడం తన విధ్యుక్తధర్మమని ఆమె భావించాలి; వివాహమైన తర్వాతకూడ వీలైనంతకాలము సేవచేయాలి.”

# లోకవార్తలు



అమెరికాలో అరిజోనా అనే ప్రదేశంలో వింత మృగ కళేబరం దొరికింది. ఇది 15 కోట్ల సంవత్సరాలనాటిదని శాస్త్రజ్ఞులఅంచనా. మొసలివంటిదే గాని మొసలికాదు. దీని పొడుగు 15 అడుగులు. పొడుగు ముక్కు; చట్టితల. ఆ తలమీదనే ముక్కు రంధ్రాలు. పదునైన కోరలపంక్తి. మొసలిజాతి ఇంకా ఉన్నా, ఈ జాతి చిరకాలం క్రిందటనే దానిపోటీకాగ లేక అంతరించిందట. ప్రస్తుతం దొరికిన కళేబరంతాలూకు మృగం 15 లక్షల సం॥ల క్రిందట చనిపోయి ఉంటుందని శాస్త్రజ్ఞులమతము. దీనికి 'ఫిటోసార్' అని పేరున్నా పెట్టారు.

♦ ♦ ♦

మన భారతదేశంలో ప్రజలపట్టి పీడిస్తున్న ముఖ్య వ్యాధులుమలేరియా, మశూచి, ప్లేగు, కుష్టు, గ్రుడ్డితనము, క్షయ, శిశుమరణాలు, బాలింత మరణాలు, సుఖవ్యాధులు, కలరా, కాన్సర్, కొంకిపురుగు మొదలైనవి. వీటిలో 100 కి, 75 కి పైగా మంచి అహారంతింటే మటుమాయమవుతాయి.

♦ ♦ ♦

భారతీయుని దామాషా రోజువారీ ఆదాయం. రు. 0-4-0 మాత్రమే, యుద్ధానికి పూర్వపు ధరల ప్రకారమైనా ఆహారంధరలు ఈఆదాయానికిమించి.

♦ ♦ ♦

దారిద్ర్యానికి తోడు ఇతర కారణాలూ ఉన్నాయి. ఒక క్రమంలేకుండా, ప్రభుత్వంవారి కంట్రోలులేకుండా అభివృద్ధి చెందుతున్న పరిశ్రమలు. చిన్నతనంలోను వెంట వెంటనేను-బిడ్డలు పుట్టడం (బాలింతల మరణాలకు మూలమిదే) పరిసరాలు కశ్మలంగా ఉన్నాయనే స్పృహ ప్రజకు లేకపోవడం, గ్రామప్రజలకు ఆరోగ్య సంబంధమైన జ్ఞానప్రదానము లేకపోవడం లాంటివి, అవి.

♦ ♦ ♦

మనదేశంలో వైద్యసహాయం విశేషాలు అతి చిత్రంగా ఉన్నాయి. మన ఆసుపత్రులలో రోగి 1 కి 1 నిమిషంకాలం విని యోగిస్తున్నారుట. 4000 జనానికి ఆసుపత్రులలో 1 పడక ఉన్నది, అదే బ్రిటనులో 28 పడకలు, అమెరికాలో 40 పడకలు.

♦ ♦ ♦

శిశుమరణాలు మరీ ఘోరము. 1941 లో చావులు 10000 కి 218 మంది. జీవంతో పుట్టిన బిడ్డలలో 10000 కి 1580 మంది సం॥ రం తిరిగేలోపల చనిపోయినారు. ఆస్ట్రేలియాలో ఈ దామాషాలే వరుసగా 91 న్ని 310 న్నీ. ఈదేశంలో పుట్టినబిడ్డలలో సగంమందికి 10-వ పుట్టినరోజు పండుగ దాటదు.

♦ ♦ ♦

వెల్లూరు జైలులో నిర్బంధితులైన కమ్యూనిస్టులు వార్డర్లను కొట్టి గాయపరచారు. ఆడ కమ్యూనిస్టులు సహా వార్డర్ల కళ్లలో కారంగొట్టి కట్టెలుతీసుకొని బాదినారట. తర్వాత వారందరిగదులు సోదాచేస్తే కర్రలు, కత్ర తుపాకులు మొత్తం 300 దాకా

దొరికాయి. తమ కిచ్చిన వంటచెరుకుతో వాళ్లు వీటిని తయారుచేశారట.

♦ ♦ ♦

తాటి చెట్లన కొంకాయ చెట్లన తియ్యని కల్లుతీసి బెల్లం చేస్తున్నారు. కొందరీ తియ్యకల్లు తాగుతారు. అది ఆరోగ్యకరము, ఆహారము అంటారు. అయితే అది త్వరలో పులిసిపోతుంది. కాన్పూరులో శాస్త్ర పరిశోధకులు ఈ తియ్యకల్లు పులవకుండా నిలువ ఉంచే వస్తువుని కనిపెట్టారట. దానితో చేర్చి ఈ తియ్యకల్లును కొన్నాళ్లు పులవకుండాఉంచి ఇతర చోట్లకు ఎగుమతి చేయవచ్చునట.

♦ ♦ ♦

ఢిల్లీలో సమావేశమైన అఖిలభారత రాష్ట్రభాషా పరిషత్తువారు "దేవనాగరలిపిలో వ్రాయబడు హిందీ" - రాష్ట్రభాషగా ఉండవలయునని తీర్మానించారు.

♦ ♦ ♦

పాలస్తీనాలో రాతిగుహలలో క్రీ. శ. 4-వ శతాబ్దంనాటి కిరస్తానుల శవాలు కన్పించాయట.

♦ ♦ ♦

'మదన' అనేతెలుగుపత్రికలో "నీళ్లాటి రేవులో" అనేకథ నసభ్యంగావ్రాసి ప్రకటించినందుకు, వ్రాసి ప్రకటించిన వారిద్దరినీ,-యం.యస్.మూర్తి, సి. వెంకట్రావుగార్లను-కోర్టువారు శిక్షించారు.

♦ ♦ ♦

కాశీ విశ్వవిద్యాలయము కమ్యూనిస్టు వ్యవహారాలలో పాల్గొంటున్నదని ఒక విద్యార్థినిని అరెస్టుచేయను పోలీసు ఆఫీసరు వచ్చాడు. ఆమె కాలేజీ హాస్టిల్ గదివదలి రాక చేతనైతే బలవంతంగా తీసుకొనిపో అన్నది. ఆ ఆఫీసరు ఏమి ప్రమాదమో అని-4 లారీలనిండా కానిస్టేబిలులను రమ్మని కబురంపాడు. ఇంతలో విశ్వవిద్యాలయాధికారులు ఆ అమ్మాయిని శాంతంగానే పోలీసుల అధీనము కమ్మని బ్రతిమాలివప్పించారు. అట్లాగే వారువచ్చి అరెస్టుచేసేముందు పోలీసు అధికారిమీదికి ఆమెచెప్పు విసిరింది. ఆ పెద్దమనిషి "ఆఫీసరును తనవిధి నెరవేర్చనీయకుండా ఆటంకపెట్టినది" అని ఆమెపై కేసుచేశాడు.

♦ ♦ ♦

అహమ్మదాబాదులో ఒక మిల్లుకూలి రాత్రి భార్యతో జగడమాడివచ్చి వీధిలో -ాలిదారిలో పడుకొని నిద్రపోయినాడు. దానిపై వానినరెస్టుచేసి కేసుపెట్టారు. క్రింది కోర్టులో మ్యాజిస్ట్రేటు సం|| ము మంచినడతకు జామీను ఇమ్మన్నాడు. అతడట్లు జామీనివ్వక జైలుకుపోయి అప్పీలు చేశాడు. అహమ్మదాబాదువంటి పట్నంలో పేదవాడు వీధిలో పడుకోవడం ఒక పెద్దనేరంకాదని అతని విడుదల కాజ్ఞాపించాడు సెషన్స్ జడ్జి.

♦ ♦ ♦

చట్టంలేని కళ్లద్దాలవల్ల కళ్లసమీపంలో చర్మ సంబంధమైన కాన్సర్ వ్యాధి వచ్చునని ఫిలడెల్ఫియా డాక్టర్లు కనుక్కున్నారు.

♦ ♦ ♦

వేల్సులో బిడ్డనెత్తుకొని బస్సెక్కినామెకు తాను లేచి సీటు ఇవ్వబోయి ఒక పెద్దమనిషి బస్సు ద్వారంలోనుంచి క్రిందబడి చనిపోయినాడు.

♦ ♦ ♦

ఈస్ట్‌హాక్‌లో ఒక అవ్వకు 84 సం||లు. ఆమెకు 18 సం||లప్పుడు పెండ్లి అయింది. 12 గురు బిడ్డలు పుట్టారు. ఇప్పుడామెకు 65 మంది మనుమలు మనుమరాండ్రు. 54 మంది మునిమనుమలు, మునిమనుమరాండ్రూ. ఇటీవలనే 131 వ బిడ్డకు నామకరణంచేసి ఆశీర్వదించిందామె.

♦ ♦ ♦

ఫిన్లాండులో ఒకాయనకు 40 సం||లు వయస్సు. ఆయన గత 20 సం||లనుంచి ప్రతిరోజూ తప్పకుండా 1500 మొ|| 2000 వరకు తుమ్ములు తుమ్ముతున్నాడు! ఇప్పటికి 15 సార్లు డాక్టర్లు ఆపరేషన్లు చేశారు. తత్కాలానికి ఉపశమించడమే గాని తిరిగి యథాప్రకారమేనట!

♦ ♦ ♦

ఒక పిచ్చిక లండన్ పేటలో, వెలుగుతున్న ఒక సిగిరెట్టు ముక్కను పట్టుకొనిపోయి గూట్లో పెట్టుకున్నది. దాంతో 5 ఇండ్లు తగులబడ్డాయి. ఒకనికి వళ్లుకాలింది. పిచ్చిక తనగూట్లోనే పిడికెడు బూడిదైపోయింది.

♦ ♦ ♦

డమాస్కస్ నగరంలో ప్రభుత్వం నిర్ణయించిన ధరకన్నా హెచ్చుగా రొట్టె, కూరలు అమ్మినారని 11 మందిని కొరడాలతోకొట్టి శిక్షించారు.

# సంపాదకీయములు

## ప్రత్యామ్నాయ ఆహార పదార్థములు

ఆహార ధాన్యములు మనదేశంలో ఇప్పుడు పండేవి మనకు చాలవు అని ఖాయమైనది. ఆర్థిక కారణాలచేత 1951 ఆఖరునుండి ఇతర దేశాలనుండి ఒక్క గింజనైనా తెప్పించకూడదని యూనియన్ ప్రభుత్వంవారు నిర్ణయించారు. ఒకవంక దేశంలో ఉన్న వ్యవసాయ సౌకర్యాలు హెచ్చుచేయాలని హెచ్చుగా పండించాలని ప్రయత్నాలు జరుగుతున్నవి. అదిగాక ధాన్యం లేనప్పుడు ధాన్యంవలెనే ఆకలిదీర్చి, దేహాన్ని పెంచే ఇతర పదార్థాలనుకూడా తినడం మంచిది అని శాస్త్రజ్ఞులు అంటున్నారు. ఇందుకుగాను యూనియన్ ప్రభుత్వం ఒక కమిటీ నేర్పరచారు. అందులో మన శాంతి రామమూర్తి గారుకూడా ఒక సభ్యులు. వీరు ధాన్యంతో పాటు వేరుశనగ, చిరుగడదుంపలు (గెనుసుగడ్డలు) అరటిపండ్లు తినవచ్చునంటారు. నెహ్రూ ఇప్పటికే గోధుమపిండిలో చిరుగడదుంపల పొడికూడా చేర్చి రొట్టెలు చేయించుకొని తింటున్నారు. యూనియన్ ప్రభుత్వంవారు వారానికి ఒకరోజు రేషన్ క్రింద ఈ ప్రత్యామ్నాయ ఆహార పదార్థాలు ఏల రేషన్ షాపులలో అమ్మరాదు - అని రాష్ట్రప్రభుత్వములను ప్రశ్నిస్తున్నారు. ప్రశ్నించడమేమిటి? ఆజ్ఞాగర్భితమైనసూచనే. దేశయార్థిక ఆహార సమస్యల సంబంధంగా ఈ ప్రయత్నాలు ప్రశంసార్హాలే. అయితే భారతీయులు మొత్తంమీద దార్ఢ్యముకల వారుకారు. మధ్యవయస్సులో ఆహారం మార్చడానికి తగిన ఆరోగ్యవంతులుగారు. నెహ్రూ తిన్నాడుగదా అని తామూ చిరగడదుంపలనుతిని నడుములు పట్టుకొని 3 రోజులు లేవజాలని మా మిత్రులున్నారు. కాబట్టి ఈ ప్రత్యామ్నాయ ఆహార పదార్థాలు తిన్నందువల్ల - కలిగే ఇబ్బందులు తెలిసి అవి ఉపశమించే మార్గాలు, అవి అసలు రాకుండానే అడ్డుకొనే ఉపాయాలు - ప్రజాసామాన్యానికి ప్రభుత్వ పరిశోధన శాఖవారు పదేపదే తెలుపుతూ ఉండవలెను. అయితే గృహలక్ష్మిమాత్రం - కేవలం ధాన్యపు అన్నంతోనే గడిపేరోజులు గతించినవి; ఇతర పదార్థాలు వాడకతప్పదని గ్రహించి వానిని హితకరంగా పచనంచేసే నేర్పుకూడా సంపాదించాలి.

## సినిమాలు

మనదేశంలోకూడా సినిమాలు బాగావ్యాప్తిలోకి వచ్చాయి. సినిమానటన ఒక సుస్థిరమైన వృత్తి అయినది. సినిమా వ్యాపారము లాభసాటిబేరమైనది. సినిమా చూడడం సామాన్యుల జీవితాలలోను ఒక ముఖ్యాంశమైనది. సినిమా వినోదమే గాక, విద్యాబోధకముకూడా అని సర్వజన సమ్మతము. నిరక్షరాస్యులెక్కువైన మనదేశంలో దృశ్యము శ్రావ్యమునైన ఈ సినిమా చాలా హెచ్చుగా ప్రబోధం చేయగలదు. అయితే విదేశాలతో పోల్చిచూస్తే మనదేశంలో చాలినన్ని అవిఇంకా ఏర్పడలేదు. బ్రిటిష్‌దీవుల జనాభా 470 లక్షలే. అయినా వారికి 6000 సినిమాలున్నాయట. అంటే దాదాపు 8000 మందికొకటి. మనదేశంలోనో - 3890 లక్షలు జనాభా, అయితే 2200 మాత్రమే సినిమాలు. అంటే 177 వేల మందికి ఒక్కటి అన్నమాట. కాబట్టి ఇంకను ఈ కళలో అభివృద్ధికవకాశాలున్నవి. దీనివల్ల ముఖ్యంగా ఎంతోమంది అనాథ స్త్రీలకు అన్నవస్త్రాలు లభిస్తున్నాయి. అయితే ఈ కళాభివృద్ధికి ఆటంకప్రాయమైన లోపాలు చాలా ఉన్నవి. నిజమైన కళావేత్తలు ఈ పరిశ్రమలో ప్రాధాన్యత వహించాలి. ఉత్తమ రచయితలరచనలు స్వీకరింపబడాలి. నటకులకు శిక్షణాలయంకూడా ఏర్పడాలి. కేవలం ముక్కుకన్ను తీరుగల నటుడైనంత మాత్రమున లాభంలేదు.

## జపాను శిశుసంరక్షణము

జపాను యుద్ధానికిముందు పాశ్చాత్య దేశాలతో తులతూగుతూ ఉండెను. జపాను పరిశ్రమలు, ముఖ్యంగా వస్త్రపరిశ్రమ, అమెరికాను మించి పోతుందా అన్నట్లుండేది. అటువంటి జపాను పరాజితమై పరాధీనమై - పరాభవింపబడినది. జపాను బిడ్డలకు పాలు, బట్ట కరవైనవి. ప్రపంచశాంతి నెలకొల్పడానికుద్యుక్తమైన యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ వారు తమ కార్యక్రమంలో - వివిధదేశాలలో యుద్ధకారణంగా అవస్థల పాలగుచున్న నోరెరుగని పసికూనలకు సంరక్షను గావించుట యొక పనిగా ఏర్పరచుకొన్నారు. వారిదయవల్ల ఆ సహాయము జపాను బిడ్డలకు సంప్రాప్తించింది. తన్మూలాన జపానుకు 500000 డాలర్ల ఖరీదుగల పాలపొడి, దూది పంపుతారట. పాలపొడి పాలుగా మార్చి 250000 మంది బిడ్డలకు పోస్తారు. దూది బట్టలుగా తయారు చేసి 350000 చొక్కాలు కుట్టించి అవసరమైన బిడ్డల కిచ్చెదరు. పోనీ యుద్ధపు ఈర్ష్యాద్వేషాలు బిడ్డలపట్లనైనా మరచినందుకు రాజకీయవేత్తల నభినందింతాము. ఈ దయాదాక్షిణ్యాలు ఆ బిడ్డల హృదయాల్లో కృతజ్ఞతపేరట కాని సత్యాన్ని పుట్టించకుండు గాకయని కోరుతాము.



## కన్ని ఇళ కాదలి

జూపిటర్ వారి "కన్ని ఇళ కాదలి" అనే తమిళ తమాషా చిత్రం ఆంధ్రదేశమంతటా విడుదలవుతుంది. చాలా ఆకర్షణీయంగా ఉంటుందని అందరూ అనుకుంటున్నారట. కథ, మాటలు, పాటలు, ఛాయాచిత్రము శబ్దగ్రహణము, నటన అన్ని తూచినట్లున్నాయని ప్రీవ్యూ ప్రేక్షకులు సంతోషించారు. స్త్రీపురుష పాత్రల రెంటిని ధరించి నటించిన తార చాకచక్యము ఎన్నదగినది. (సినీఫాన్)








**జయప్రకాశ్ లేఖలు** (సోషలిస్టుపార్టీ కార్యక్రమము) = జయప్రకాశనారాయణ-తెలుగు అనువాదం = ముదిపర్తి సత్యనారాయణగారు = శ్రీ దుర్గా మాడర్న్ బుక్ డిపో - గవర్నరుపేట, బెజవాడ = వెల రూపాయ.

1942 లో క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో అజ్ఞాతవాసంలోనుంచీ - సామ్యవాద సిద్ధాంతానుసారం స్వాతంత్ర్య పోరాటం జరుపడానికిన్ని పిదప పెద్దలు పార్లమెంటరీ కార్యక్రమాన్ని చేపట్టిన తర్వాత ఉద్యమం నడపడానికిన్ని సోషలిస్టుపార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణగారు వ్రాసిన లేఖలివ్వి. అయితే "క్విట్ ఇండియా"తో (15-8-47) ఈ లేఖలపని ముప్పాతికా మువ్వీసం అయిపోయింది. ఇక ఆ పార్టీకలలుగన్న స్వరాజ్య స్వరూపం తెలుసుకోను ఈ లేఖలు కొంతవరకు ఉపయోగింపవచ్చు.

**చారుణి** : పాటిబండ మాధవరాయశర్మ ఎం. ఏ (ఆనర్సు) = శ్రీ బాబీ గురుకులము. బాబీనగరం, బెజవాడ, వెల రు 1-0 0

ఇది చిన్న, పెద్ద, అన్నీకలిపి 150కి పైన పద్యాలుగల చిన్న పద్యకావ్యము. సుమారు 60 పుటల గ్రంథము. కథ రాజస్థాన కథావళిలోనిది. చారుణి అనేకాపు బాలిక జొన్నచేను కాస్తూ వేటకువచ్చిన రాజకుమారునికి అతనితోడి వేటరులకు - జొన్నదంటుతో అడివిపందిని చంపిచూపి - తనవీర ప్రతాపములను ప్రకటించును. పిదప కామార్తిం జెంది రాకుమారుడు జొన్నచేనిందరియగా వడిసెల రాతితో గుర్రమును పడగొట్టి రాకుమారునితల గాయపరచును. ఆ పిదప తన కొంటెతనమునకు తానే నొచ్చుకొని రాకుమారుని క్షమాభిక్ష వేడును. అంత నొండొరులు అనురాగము రాగిల్ల గాంధర్వవిధిన వివాహమగుదురు. తండ్రి తెలిసి కోపించి రాకుమారుని శిక్షింపబోవును. అతడు చితోడు రాజపుత్రుడని తెల్లిసి కన్యాదానమొనర్చును. ఈ కథను ఎంతో మనోహరముగా మాధవరాయశర్మగారు రచించినారు. అదునుకుదగిన పదునున శైలి నడిచినది. ఈ కావ్యము కాలేజీలలో పాఠ్యగ్రంధముగా నుంచదగినది.

**బాలవినోదం** : మేనేజర్ "బాలవినోదం" 32 కృష్ణప్పనాయకన్ టేంక్ వీధి జి. టి. మద్రాసు. సం॥ చందా రు 1-8-0.

ఇది పసిబిడ్డలకోసరం ప్రచురింపబడే చిన్న తెలుగు మాసపత్రిక. ఇదివరకే 'బాల' 'చందమామ' మొదలైనవి ఈ రంగంలో పనిచేస్తూన్నాయి. వానికిది తోడైనది. వాటికన్నా చిన్నసైజు. ఖరీదుతక్కువ. ఈ ఆగస్టు 1 వ తేదిననే వెలువడింది. సంపాదకులు శ్రీ ఏ. యన్. రాఘవాచార్ గారు. కథలు, హాస్యాలు పిల్లలకి సులువుగా బోధపడేట్లు ఇంకాకొంచ సరళంకావాలి. బొమ్మలుకూడాబాగానే ఉన్నవి.

**తెలుగు పోస్టుమెన్ హెరాల్డు** : సంపాదకులు : శ్రీపాలకోడేటి సూర్యప్రకాశరావుగారు బి. ఏ. రాజమండ్రి సం॥ చందా రు 3-0-0 లు

ఇది మాసపత్రిక. పోస్టుమాన్ సమస్యలే ఇందులో వ్యాసాలుగా, పద్యాలుగా, కథలుగా - వివరించబడినవి. దీనివల్ల పోస్టుమెన్ల సమస్యలు వారిలో వారికి బోధపడడమేగాక ప్రజాసామాన్యానికిన్ని బోధపడగలవు. అందుచేత, ఈ ప్రజాయుగంలో, వీరి ఉద్యమము యెడల ప్రజలకు నిజమైన సానుభూతి కలుగును. సమర్ధులు, త్యాగులు దేశభక్తులునైన శ్రీపాలకోడేటి ప్రకాశరావుగారిని తమ పత్రిక సంపాదకులుగా బడసినందులకు ఆలిండియా పోస్టుమెన్ లోయర్ గ్రేడ్ స్టాఫ్ యూనియన్ రాజమండ్రి బ్రాంచివారిని అభినందించుచున్నాము.

## గ్రంథాలయ సర్వస్వము : వకమటపోస్టు, కృష్ణాజిల్లా.

గ్రంథాలయ సర్వస్వముయొక్క 1949 సం॥పు ఏప్రిల్ సంచిక. 13 వ సం॥ ప్రథమ సంచిక. దీనికి సంపాదకులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, సురవరము ప్రతాపరెడ్డి, పాతూరి నాగభూషణం గార్లు. ఇందు స్వవిషయంలో - గత "15 నెలలకాలంలో మేము 10 సంచికలనుమాత్రం వెలువరించగలిగితిమి." అన్నారు. ఇది ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారితరఫున ప్రచురింపబడుచున్న పత్రిక. ఇట్టిసితి ప్రచురణ కర్తలతప్పగాదు. పూర్వం శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి యాజమాన్యంలో ఉన్నప్పుడూ దీని నడక ఇట్లాగే ఉండేది. ఇది వాస్తవానికి ఆంధ్రదేశంలో అక్షరాస్యులైన వారందరితప్పు. అయితే సంపాదకవర్గంవారు మాత్రం ఉత్తమోత్తమ విషయములను ఇందుచేర్చి దీన్ని చిరకాలము చదువవలసిన దానినిగా చేస్తున్నారు.

## మద్రాసురాష్ట్ర స్త్రీజనాభ్యుదయశాఖవారి ప్రచురణాలు: గవర్నమెంటుహౌస్, మద్రాసు

మద్రాసులో ప్రభుత్వం తరఫున సమర్థురాలైన శ్రీమతి పారిజాతం నాయుడుగారు చాకచక్యంతో స్త్రీజనాభ్యుదయ శాఖను నడుపుతున్నారు. వీరొక ప్రచురణ శాఖనుకూడా నిర్వహిస్తున్నారు. దాని తరఫున కొన్ని కరపత్రాలు తెలుగు, అరవం, మళయాళం, కన్నడం, ఇంగ్లీషు భాషలలో అచ్చువేస్తున్నారు. "సౌభాగ్యం" అనే మాసపత్రికకూడా వేస్తున్నారు. అన్నీవారు దయతో మా కార్యాలయాని కంపారు. సావకాశంగా రాగల సంచికలో విమర్శిస్తాము.

## కోణంగి = సంపాదకులు : శ్రీ. ఎస్. జి. ఆచార్యాగారు 1/33 వరదరాజులు నాయుడువీధి మద్రాసు 8. సం॥ చందా రు 3-0-0 విడిపత్రిక 0-2-0

మా మిత్రులు శ్రీ ఎస్. జి. ఆచార్యాగారు 16-7-49 నుండి తమ సంపాదకత్వముక్రింద వెలువరచుచున్న "హాస్యపక్షపత్రిక." వీరిదివరలో ఏ పత్రిక నడిపినా అందులో హాస్యం నాలవపాలైనా ఉంటూవచ్చింది. ఇప్పుడీ పత్రికనంతా హాస్యంతో ముంచెత్తదలచారు. ఇదెంతైనా అవసరమైన పత్రిక. అనేక సమస్యలతో, అంతఃకలహాలతో పిడచబారిన తెలుగువారి చిత్తవృత్తులకు హాస్యరచనలు చాలా అవసరం. Laughter lubricates the soul - (నవ్వుచిత్తవృత్తిని మార్దవం చేస్తుంది) అన్నారుగదా హాస్యచక్రవర్తి ఆంధ్రరత్నం.

గతసంచికలో ప్రచురించినవిగాక ఇంకా మా కార్యాలయానికి విమర్శనార్థంవచ్చిన పుస్తకాలు: లక్కపిడతలు, ఆడజన్మ, కళాజీవి, అశోకనరకం, సత్యనారాయణచరిత్ర, అహల్యాగౌతము, ఆంధ్రనారి, పండితరాయలు.

# శ్రీ విరోధినామ సం॥ర శ్రావణ భాద్రపద మాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | మం | స 16.52 భ 32.25 రావి 21.40 స్మార్తానాం శ్రీ కృష్ణజన్మాష్టమీ. |
| | 17 | బు | అ 19.58 కృ 36.54 దివి 4.39 నవమీతిథిః హరిపదపుణ్యకాలం. |
| | 18 | గు | న 22.7 రో 40.16 దివి 19.9 రావి 23.21 శూన్యతిథిః. |
| ఆగష్టు నెల | 19 | శు | ద 22.55 మృ 42.22 భ 22 55 దశమీతిథిః. |
| | 20 | శ | ఏ 22.27 ఆర్ద్ర 43.14 దివి 3.40 దిథిద్వయం సర్వేషామేకాదశీ. |
| | 21 | ఆ | ద్వా 21.45 పున 42.57 దివి 13.5. |
| | 22 | సో | త్ర 17-56 పుష్య 41.34 దివి 2.29 చతుర్ధశీతిథిః మాసశివరాత్రిః. |
| | 23 | మం | చతు 14.6 ఆశ్రే 39.16 దివి 12.20. |
| | 24 | బు | ● 9.27 మ 36.13 దివి 7.44 రావి 23.47 |
| | | | **భాద్రపద మాసము.** |
| | 25 | గు | పా 4.9 ద్వితీయం 54.14 పూఫ 34.36 రావి 18.12. దినత్రయం చంద్రోదయం. |
| | 26 | శు | త 52 18 ఉఫ 28.36 రావి 16.58 హరితాళికావ్రతం బలభద్రజయంతి. |
| | 27 | శ | చ 46.8 హ 24.25 రావి 11.54 వినాయకచతుర్ధి. |
| 1949 సం॥ | 28 | ఆ | పం 40.7 చి 20.15 రావి 2.15 ఋషిపంచమి. |
| | 29 | సో | ష 34.24 స్వా 16.22 దివి 29 34 సూర్యషష్ఠి. |
| | 30 | మం | స 29.13 విశా 12.57 దివి 22.29 పూ. ఫ. ముక్తాభరణసప్తమి. |
| | 31 | బు | అ 25.3 అనూ 10.11 దివి 23 43 అష్టమీతిథి. |
| | 1 | గు | న 23 6 జ్యే 8.9 తిథిద్వయం నందానవమి. |
| | 2 | శు | ద 18 29 మూ 7.8 దివి 3.12 రావి 0.16 ఏకాదశీతిథిః |
| | 3 | శ | ఏ 17.4 పూషా 7.13 భ 17.4 ద్వాదశీతిథిః సర్వేషాం పరివర్తనైకాదశీ. |
| | 4 | ఆ | ద్వా 16.52 ఉషా ది 33 దివి 18.58 త్రయోదశీ కలికిద్వాదశీ. |
| | 5 | సో | త్ర 17.56.శ్ర 10.5 దివి 21.43 చతుర్ధశీతిథిః పుష్య అనధ్యదయన |
| సెప్టెంబరు నెల | 6 | మం | చ 20.16 ధ 14.52 రా 3.36 శూన్యతిథిః అనంతపద్మనాభవ్రతం |
| | 7 | బు | ○ పౌ॥ 23.44 శత 19.4 రావి 6.35 పూర్ణిమావ్రతం తిథిః. |
| | 8 | గు | బ పాడ్యమి 28 5 పూభా 25.30 రావి 21.22 మహాలయ పక్షప్రారంభం. |
| | 9 | శు | వి 33.2 ఉ భా 31.51 |
| | 10 | శ | త 38.13 రే 38.23 దివి 5.7 ఉండ్రాళ్లతద్ది. |
| | 11 | ఆ | చ 43.8 అశ్వ 44.39 రావి 34 |
| | 12 | సో | పం 42.24 భ 50.18 |
| | 13 | మం | ష 50.41 కృ 55.4 దివి 22.41. |
| | 14 | బు | స 52.53 రో 58.42 వ 51.48 రావి 7.3 శీతలావ్రతం. [మహాలక్ష్మీవ్రతం. |
| | 15 | గు | అ 53.49 మృ 60.0 దివి 13.15 వైష్ణవానాం శ్రీ కృష్ణజయంతి మధ్యాష్టమీ |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

